బ్రహ్మశ్రీ [illegible] సీతారామశాస్త్రిగారి సన్నిధియందు.
సమర్పించు [illegible]
రా. అ. కృ. శ.
12. 3. 43

శ్రీ

# శాలివాహన

# గాథా సప్తశతీ సారము.




ఆంధ్రీకర్త:

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.


శ్రీ సాధన ముద్రాశాల,—అనంతపురము.

బ్రహ్మశ్రీ [illegible] సన్నిధియందు
సమర్పించు ప్రణామములు.
రా. అ. కృ. శ.
12 · 3 · 43

శ్రీ

# శాలివాహన

# గాథా సప్తశతీ సారము.



ఆంధ్రీకర్త:

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

శ్రీ సాధన ముద్రాశాల,—అనంతపురము.

"అవినాశిన మగ్రామ్య
మకరో త్సాతవాహనః
విశుద్ధజాతిభిః కోశం
రత్నైరివ సుభాషితైః"

(సాతవాహనుఁడు, శుద్ధమైన జాతిగల ర-త్నములవంటి సుభాషితములచే, ఎన్నఁడును నశింపని- గ్రామ్యము కాని- కోశమును రచించెను.)

(హర్షచరిత్రమున బాణభట్టు)

# ఆంధ్రీకర్త మనవి.

మూలమును గూర్చియు తజ్జ్ఞమానుగూర్చియు నేఁజెప్ప వలసినది—చెప్పఁగలిగినది—అంతయు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి ప్రస్తావనలో నుదాహరింపఁబడిన నాలేఖయందుఁ గలదు.

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి యభిమానమును నాకృతజ్ఞతతో సరితూఁచుటకు నా కిష్టములేదు. అది దీనిమేరను మీఱినది. అనారోగ్యస్థితి యందున్నను పెక్కు కార్యములున్నను అడిగినవెంటనే వారు దీనికి ప్రస్తావన వ్రాసియిచ్చి నన్ను ధన్యునిజేసిరి.

ఇఁక దీనినింత యందముగా, శీఘ్రముగా—విలంబమైయున్న నది నాతప్పుగాని వారిది గాదు—అన్ని యనుకూలములను గల్పించి ముద్రించి యిచ్చిన శ్రీ సాధన ముద్రాశాలాధికారులన్ననో అన్నివిధముల మావారు. వారికి బహిరంగముగా కృతజ్ఞతను జూపఁబ్రయత్నించుట స్నేహాభిమానముల విలువను కొంచెపఱచుటయే యగును.

మైసూరు
ప్రజోత్పత్తి, భాద్రపద
కృష్ణ ౭. శా. శ. ౧౮౫౪ } రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

# ప్రస్తావన.

---

ఈ గ్రంథమును రచించిన శ్రీ అనంతకృష్ణశర్మగారిని గూర్చి ప్రశంసింపఁబూనుట య-థక ప్రసంగము. వీరు ఆంధ్రసాహిత్యలోకమున సుప్రసిద్ధులు. సంస్కృత విద్యాపారీణులు. సంగీత కళాకోవిదులు. ఒక పాండిత్యమే గాక రసికత్వమును సంపూర్ణముగ వహించిన ధన్యులు. ముఖ్యముగా నా కెంతేయు మిత్రులు. వీరు మొట్టమొదట నాతోఁ బరిచయము చేసినది సుమారు ౨౦ ఏండ్ల క్రిందట. అప్పుడు వయసున చిన్నవారయ్యు పాండిత్యమున ప్రగల్భులై యుండిరి. కొంతవఱకు పాండిత్య పరాయణులును. అయినను వారి సహజ సౌమనస్యమును, ఒకించుక బహుశః నాయొక్క-వోహాదమును జేరి సరససాహిత్యమునకుఁ బ్రేరేపించినవి. అప్పటినుండియు వీరు రచించిన గ్రంథములన్నియు ఆనంద వాహినీ తరంగములు. "మీరాబాయి"యు "తార"యు నిందునకునిదర్శనములు. భావనాశక్తియందేకాదు. విమర్శనక్రియ యందును వీరు అసాధారణ ప్రజ్ఞకలవారు. వీరు రచించిన ఎఱ్ఱన్న నాచన సోమన్నల తారతమ్యనిరూపణము అమోఘమైన వ్యాసము. వేమన్నపై వీరు వ్రాసిన గ్రంథము ఇప్పటి వచన

గ్రంథములలో నగ్రగణ్యము. ఇది గ్రంథమనుట కంటె కావ్యమనుట ఇంకను నిజము. అట్టినా ఈ గాథాసప్తశతీసారమును ఆంధ్రీకరించుట నా యొక్క రసజ్ఞతకును మన భాషకును గురుత్వ మాపాదించు కార్యము.

ఏ పరిస్థితులయందు గ్రంథములు రచింపఁ బడినవో అవి కొంతకుఁ గొంత మనకు తెలిసిన గాని వాని స్వారస్యమును సంపూర్ణముగ గ్రహింపఁజాలము. నాకు ఈ గ్రంథ విషయమైన చరిత్ర జ్ఞానము సర్వశూన్యము గావున దానింగూర్చి ప్రశ్నలను వేసి శ్రీ శర్మగారినే జవాబులు చెప్ప మంటిని. తమ శోధనలచేఁ దేలిన విషయములను సమగ్రముగ వారు నాకు నివేదించిరి. ఆలేఖనే యిందుదాహరించుచున్నాను:—

"......ఈ గ్రంథము ప్రాకృతభాషలో ఆర్యా వృత్తములలో వ్రాయఁబడినది. ౭౦౦ పద్యములు గలిగి ఏడు శతకములుగా విభాగింపఁ బడినది. ఒక్కొక్క పద్యమును స్వతంత్రమై పరస్పర సంబంధము లేనిదనుట స్పష్టమే. ఇట్టి వానికి 'గాథలు' అని వ్యవహారము......... దీనిని సంగ్రహించిన వాఁడు శాల, హాల, సాతవాహన, శాలివాహన, సాలాహణ, ఇ-

త్యాది నామములుగల ఆంధ్రరాజు. ఇతఁడు శకారాతియగు విక్రమాదిత్యుని సమకాలికుఁడైన కుమ్మరి దొరయనియు, ఇరువురికిని జరిగిన యుద్ధములో విక్రమార్కుని జంపి చక్రవర్తియై రాజ్యమేలెననియు వాడుకకథ ప్రసిద్ధమే. విక్రమార్కునికి ప్రతిగా ఇతనిపేరను ఒక శకమేర్పడి దక్షిణదేశమందంతను ప్రచారమందున్నదిగదా. క్రీస్తుపూర్వము మొదటి శతకము నడుమ విక్రమశకమును, క్రీస్తుతరువాత మొదటి శతకము తుదిని శాలివాహన శకమును ప్రారంభమగుచున్నవి. క్రీ॥ శ॥ ఏనిమిదవ శతకపు బాణభట్టు ఇతనిని పేర్కొనియున్నాఁడు. అతనికన్న ప్రాచీనమైన వాత్స్యాయన కామసూత్రమున ఇతనిపే రుల్లేఖింపఁబడియున్నది. చరిత్ర శోధకులు ఇతనిని ౧, ౨, ౩, శతాబ్దములకు వేఱువేఱుగా వేయుచున్నారు. అనేకులితనిని మొదటి శతకము వాఁడనియే నమ్ముచున్నారు.

ఇతనికి సంస్కృత ప్రాకృతములందు ప్రసిద్ధమైన పేరు 'గాథా సప్తశతి'. కాని 'శాలివాహన సప్తశతి' యనియు వాడుక గలదు. "నూనూఁగు మీసాల నూత్న యౌవనమున శాలి

హాసన సప్తశతి నొడివితి" అని శ్రీనాథుఁడు వ్రాసెను. అతని యాంధ్రీకరణము మన దౌ-ర్భాగ్యముచే-లేక నాభాగ్యముచే-నశించినది. శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు తాము యొ ఆ గ్రంథమున్నట్లు సూచించినారు.....(ఇది గాక శాలివాహనుని విజయములను దెలుపు 'లీలావతి'యను ప్రాకృత కావ్యము లభించిన దనియు ప్రకటించుచున్నామనియు వారు బ-హిరంగపఱచినారు) కీ॥ శే॥ వంగూరి సుబ్బ రావుగారు తమ శతక కవుల చరిత్ర యుపో-ద్ఘాతములో-ఎక్కడనుండి సంపాదించిరో కాని-శ్రీనాథుని శాలివాహనసప్తశతిలోనిదని యీ క్రింది పద్యము నుదాహరించినారు.

'ఉ. వారణసేయఁ దావగాన
  వా, నవవారిజమందుఁ దేఁటి క్రొ
వ్వారుచునుంట నీవెఱుఁగ
  వా, ప్రియ వాతెఱఁగంటిఁ గంటి కె
వ్వారికిఁ గెంపు రాదె, తగ
  వా మగవారల దూఱ, నీ విభుం
డారసి నీనిజంబెఱుఁగు
  నంతకు నంతకు నోర్వ నెచ్చెలీ!'

"కాని యిప్పటి సప్తశతి ప్రతిలో దీనికి మూలమైన

ప్రాకృత గాథ కానరాదు. ఇప్పుడచ్చైన ప్రతికిని అందందులభించు వ్రాంత ప్రతులకును పద్యముల సప్తశత సంఖ్య యొక్క పైనను తారుమారులు చాలకలవని తెలియవచ్చుచున్నది. ప్రతులలోని పద్యములన్నియుఁ జేర్చిన సుమారు రెండువేల పద్యములగునఁట! ఒక పండితుఁడు దీనిని నూతనముగా సంస్కరించి ప్రకటింపఁ బ్రయత్నించుచున్నాఁడని వినికి.

"సర్వజ్ఞచక్రవర్తి, వీరనారాయణుఁడు – ఇత్యాది బిరుదులు గల కొండవీటి పెదకోమటి వేమ భూపాలుఁడు – శ్రీనాథకవి కాశ్రయదాత – ఈ సప్తశతిలోనుండి సారమైన నూఱు పద్యములనేఱుకొని సంస్కృతమున వ్యాఖ్యానము చేసినాఁడఁట. 'కోట్లకొలఁది గాథలనుండి హాలుఁడు ఏడువందలు సంగ్రహింపఁగా నే నిప్పుడందును సారభూతమైన నూఱింటి నేర్చి టీకను వ్రాసితి'నని యతఁడు చెప్పుకొన్నాఁడఁట. (ఆంధ్రపత్రిక, శుక్ల సంవత్సరాది సంచిక, పుట ౧౬లో శ్రీ అమరవాది హనుమచ్ఛాస్త్రి గారు.) కాని నేదానిని జూడఁగలుగలేదు.

"ఇప్పుడు ప్రకటింపఁబడిన గ్రంథమందలి యేడు వందల పద్యములపైకి సుమారు నాలుగు

వందల పద్యములకు కర్తలపేర్లు నాగ్రంథ మందుదాహరింపఁబడినవి. తక్కినవి తెలియ లేదు. ఒక్కొక్కఁడు వ్రాసినవి పెక్కు పద్యములు గలవు. అందులో సంగ్రహకర్తయగు హాలభూపతియే వ్రాసినవి పెక్కు గలవు. తక్కినవారిలో ఎందఱు సమకాలికులో ఎందఱు ప్రాచీనులో తెలియు మార్గములు లేవు. ప్రవరసేనుఁడను వానిపేర కొన్ని గాథలు ఈనా సంగ్రహమందు చూడవచ్చును. ప్రవరసేనుఁడనువాఁడు ప్రాకృత భాషయందే కాండములతో వ్రాసిన 'సేతుబంధము' అను ప్రసిద్ధ ప్రాచీన కావ్యమొకటి కలదు. ఇతఁడితఁడే కావచ్చును. సేతుబంధకర్త కాలమును మనకు స్పష్టముగా తెలియదు. కాని క్రీ॥ 7వ శతాబ్దమునకంటె ప్రాచీనుఁడని నిశ్చయముగా తెలియును. ఇదిగాక హాల మహారాజు యొక్క ఆస్థాన పండితుఁడగు శ్రీపాలితుఁడు అతనిచే చాల పూజలు గొన్నాఁడని వేఱొకచోఁ జెప్పఁబడినది. ప్రకృత గాథా సంగ్రహములో పాలిత కవిపేరఁ గొన్ని గాథలున్నవి. 'బృహత్కథ' యను పైశాచభాషాగ్రంథమును రచించిన గుణాఢ్యపండితుఁడు సాతవాహనుని యాస్థాన

మందుండెనని కథా సరిత్సాగరమునఁ దెలియ వచ్చును. ఈగాథా కవులలో రోహా, రేవా, మాధవీ, అణులచ్ఛీ, అసులద్ధీ, వహాయీ, ససిప్పహా, నాథా, అను ఎనమండ్రు స్త్రీలు గలరనుట ఆకాలపు స్త్రీల గౌరవమును పురుషుల యౌదార్యమును సూచించు విషయము.

"ఇందలి పద్యములలో అనేకములు ప్రస్తావ వశముగా చెప్పఁబడిన చాటు పద్యములే యన వలసియున్నది. ఆకాలపు ప్రాకృత వాఙ్మయ మంతయు ముక్కాలు మువ్వీసము నష్టమై యుండుటచే ఇందలి కొన్ని పద్యములే గ్రంథములనుండియైనను ఎత్తి కూర్పఁబడినవా యను విషయము నిర్ధరింప వీలులేదు.

"ఇప్పుడు నేను ప్రకటించు పద్యములన్నియు ఆంధ్రీకరణములేకాని నాసొంతపు రచన యొక్కటి యును లేదు. నేను జేసినదంతయు ఆయేడు నూర్లలో నాయభిరుచికి నచ్చినవాని నేఱు కొనుట, మూలభావమును చెడనీయక తెలుఁగులోఁ బెట్టఁ బ్రయత్నించుట—ఇంతే......"

ప్రాకృతభాషలో పుంఖాను పుంఖములుగ గొప్ప కావ్యములును శాస్త్రములును ఉండెననుట నిర్వివాదము. ఆభాషచేసిన దురదృష్టము అది

బౌద్ధమతమునకు ఆలవాలముగా నుండెను. ఆపాప పరిహారార్థము వైదిక మత పునరుద్ధారకులు దానిని త్రివ్వి అందున్న పుస్తకముల మంటఁగలిపిరి. కొన్ని మాత్రము ఈమారణ తంత్రమునుండి తప్పించుకొన్నవి. మఱికొన్నింటికి స్వరూపము చెడినా, తిబెత్తు (త్రైవిష్టప) భాషలలో లీనమై యున్నందున నిర్మూలము కాలేదు. భాగ్యవశమున ఈ గాథలును మనపాలికి నిలిచినవి.

ప్రాకృతములు జన సామాన్యములో వ్యవహరింపఁబడుచుండిన భాషలు. ఇప్పటి దేశభాషలం బోలినవి. వ్యావహారిక భాషయందు వ్రాయఁబడిన వేమన్న పద్యములఁ బోలిన గ్రంథములు ఎట్లు సామాన్యప్రజల జీవితముం బ్రదర్శించునో అట్లే ప్రాకృత కావ్యములును బ్రదర్శించుచుండెనేమో. సిద్ధాంతముగఁ జెప్పలేము. కథా సరిత్సాగరమందు మన పురాణకథలు లేవు. రామాయణ భారత వీరుల ప్రస్తావనయు ఇంచుమించు సున్న. ఇంద్రాదిదేవతలును అట్లే కానరారు. మొత్తముమీఁద దేశీయుల దైనందిన జీవితమే అందు ప్రతిఫలితము. ఊహించి యూహించి యెంత విపరీతాతిశయోక్తులకుఁ బోయినను ప్రపంచ జీవితవాసనను వదలినది కాదు. ఇది

యీ విషయమున ఒక్క శతాబ్దమునకు పూర్వము
పాశ్చాత్త్యులలో ప్రబలియుండిన 'రోమాన్సు'
(Romances) లను బోలినది.

ఈ గాథాసప్తశతిలోని అనన్యసాధారణ
మైన విశేషమేమనఁగా అట్టి విపరీతపుటూహ
లును వర్ణనములుఁ గూడ నిందులేవు. విషయ
ములు సహజములు. జీవితమునకు యథార్థములు.
ఆజీవితము సైతమెట్టిది? ఇందు నాగరక వాసన
లేదు మన ప్రబంధములలోని నాగరక వాసన
యెట్టిదనఁగా పట్టణములలోని, మురికికాలువల
దుర్గంధము. 'వప్రిస్థలీచుంబితాంబర'ము లైన
పట్టణములు; అందు దినదినమును-అనఁగా అమా
వాస్యనాఁడు తప్ప-చంద్రునిలోనుండు కాటుకను
దీసి కండ్లకు రాచుకొను కన్యామణులు; కామా
వేశముతో స్త్రీల యంగ పరిశీలనమే ప్రధాన
కార్యమై యుండు రాజులు; మోహాతిరేకముచే
ఉద్యానవనములో పడి పొర్లుచుండెడు నారీరత్న
ములు; వారి పచ్చితలంపులు; అంతకంటె పచ్చివి
యైన మాటలు-ఇత్యాది రోఁత లీగ్రంథమున
లేవు. మఱి యుండలిది పల్లెటూరి వాని జీవితము.
పొలముల ప్రక్కన గుడిసెలలో నుండు బీదసాదల
మనోహరమైన ప్రేమచర్యలు, గుట్టుదాఁచి నర్మ

గర్వముగాఁ బలుకు తీపిమాటలు, చిఱునవ్వుతోఁ జేయు హాస్యములు మొదలైనవి ఇందుఁగలవు. గుడిసెలు, వాననీళ్ళు కాఱుచుండు కష్టాలు, పిండిదంచుట, పొలములలో కృషిచేయుట ఇత్యాదులు ఈరంగములోని ముఖ్యాంశములు. మనసును నిరుగాఁజేయు లీలలనిన ఇందుండునట్టివి. శాంతముగానుండు ప్రేమసాగరమందలి లేఁదరఁగలలో పున్నమ చంద్రుని కిరణములు సోఁకఁ బ్రతిఫలించిన కాంతుల కెనయైనవి దీని యందలి భావములు. ఇందలి భావములు, మాటలు, ఉపమలు మొదలగునవి స్వచ్ఛందముగ నుప్పతిల్లినవి. దూరపు టూహాల సహాయముచే బలాత్కారముగఁ బొందింపఁబడినవి యొకటి రెంటికన్న నెక్కువగా లేవు. పద్యములన్నియు భావాంబరమునఁ బ్రకాశించు చుక్కలు. మందహాసమున కన్నులతో సైఁగ చేసి మన భావములను వశపఱచుకొని పైనికి ఆకర్షించునవి. కన్నును మనసును వశపఱచుకొను ఆకృతులన్న నిందలి స్త్రీలే. స్త్రీప్రకృతికి వన్నెను గౌరవమును గల్పించువారు వీరు. ఆడంబరములు లేనివారు. చీని చీనాంబరములు రత్నాలనగలు కలనైనఁ జూచియెఱుఁగరు. సహజ సౌందర్యపూతలు. సహజ విలాసభాషితలు. స్వచ్ఛందాను

రాగమును రంగమున వెల్లివిరిసిన భావములను బట్టి ఆటలాడు బాలికలవంటివారు. మఱుఁగు మానము సుకుమారత్వము ఉన్నవి గాని మనసునకు విపరీతముగ వర్తింపరు. వారి మనసులు మంచివిగాన వారి చర్యలును సహజముగను మనోహరముగను ఉండును.

'పువ్వువిల్తు శాస్త్రమర్మము' (ప. ౨) లిందు వివరింపఁబడినట్లు ఏగ్రంథమందునులేదు. 'శాస్త్రమర్మము' అనుటకంటె 'కళామర్మము'లని యుండినచో నింకను బాగుండెడిది.* ఏలనశాస్త్రము జ్ఞాన ప్రపంచమునకుఁ జెందినది. కళఅనుష్ఠానమునకు; అనుభవమునకు శాస్త్రము. శాస్త్రము తెలిసినవాఁడు కళయం దసమర్థుఁడుగానుండవచ్చును. కళయందు సమర్థులైనవారు దానికి మూలాధారమైన శాస్త్రము నెఱుఁగని వారుగావచ్చును.

ఈ గ్రంథములోని నాయికలు భాగవత దశమస్కంధములోని గోపికలట్లు ముగ్ధలు. కృ-త్రిమమనునది యెఱుఁగనివారు. వీరు అనుభవించు సుఖములు, ఆనందములును దినదిన జీవితమును

---

* ఈ సవరణ కృతజ్ఞతతో సంతోషముగా నంగీకరించి యుందును గాని కాలము మీఱినది. 'కామస్య తత్త్వచింతాం' అని మూలము. శా. అ. కృ.

పాలనుండి తీయఁబడిన వెన్న. మాసుఁడు—

శృంగారము:—

"ఆ. అడుగుఁ దమ్ములందుఁబడి వేఁడు పతి పిఁలు
చిన్ని కొమరుఁడెక్కి చెలఁగి యాడ,
అలుకయెంత తెగనిదయ్యును నిల్లాలి
మోమునందు నవ్వు మొలచెనపుడు" (ప. ౫౧)

"ఆ. వంట యింటి పనులనంటిన మసిచేయి
సోఁకియుండఁ జంద్ర సుందరముగ
నింపుగొల్పుచున్న యిల్లాలి మోమును
భర్త నవ్వుచున్నవాఁడు చూచి" (౭)

ఇట్లే ౪౮, ౫౯, ౬౧, ౧౮౧, ౧౫౩, ౧౫౬ మొదలగు పద్యములు.

ఇంక అతిశయోక్తులు ఉత్ప్రేక్షలన్న నిట్టివి గదా నిక్కములు!

"తే. పూనియూఁదకు నెఱబాణ! ప్రొయ్యిమీఁద
నలుకగొనఁబోకు; రక్తపాటల సుగంధ
మైన నీయూర్పుఁ జవులకు నాసగొనుచు
పొగలెగయుఁగాని మండదీ ప్రొయ్యినగ్గి"

ఇట్లే ౧౩౯, ౧౭౬, ౩౩౮, ౪౫౦, ఇత్యాది పద్యములు.

పల్లెటూరి జీవితమును బ్రదర్శించు పద్యములలో ఒకటి రెండు మచ్చుకు:—

“ఆ. దొరకకుండ నేఁడు దొరకిన చెంగావి
చీరఁగట్టి కాఁపువారి కోడ
లదిగో! చిన్నదయ్యె నడగక తిరిగెడు
విరివియైన యూరి వీథులందు!” (౧౬౨)

“క. కనుపాపల నరమూయుచుఁ
గొనగన్నులఁ జూచుచుండు కోడలి తెఱఁగున్
గని యజమానుఁడు వలద
న్నను తెరువరి మందిరాంగణముననె విడిసెన్”
(౧౭౧)

మఱియు ౧౦౭, ౧౪౭, ౧౬౬, ౨౦౧, ౨౦౫, ౨౧౧ ఇత్యాదులు.

ప్రకృతి వర్ణనము.—

“క. కలఁగవు కమలంబులు; హం
సలు గదలవు; చూడవమ్మ చక్కఁగ నెవరో
తలకిందుగ నాకాశము
నిలిపినవారత్తె! చెఱువు నీళులలోనన్” (౬౯)

ఇంకను ౧౯౭, ౨౪౪, ౩౦౯, ౩౨౩, మున్నగు పద్యములు.

**నర్మవచనములు —**

"ఆ. కనులు గానరాని కటికి చీఁకటి రేయి;
వలసపోయె మగఁడు; వట్టియిల్లు;
దొంగ లెవ్వరైన దోతురు సుమ్ము; ని
ద్రింపవలదు ప్రక్కయింటివాఁడ!" (౨౧౮)

ఇట్లే ౧౦౦, ౧౧౮, ౨౨౭, ౨౫౫ ఇత్యాదులు.

**భావమును అకస్మాత్తుగా తెల్పుట.—**

"తే. కలికి! సాజంబుగా నిండుఁగనుల వానిఁ
జూచెదవుగాని క్రీఁగంటఁ జూడకమ్మ;
అతనిఁ జక్కఁగఁ జూచినయట్టులగును;
నీవునొక ముగ్ధవనుచు మన్నింత్రు జనులు" (౧౫౩

ఇదేరీతిని ౧౫౨, ౨౩౪, ౨౪౦, ౨౫౬, మున్నగునవి.

**అపురూపమైన అనన్వయాలంకారము —**

"ఆ. చక్కఁదనము గలుగు చానలు జగములో
నెందఱున్ననేమి? యింత వినుము—
ఒడలి చెలువునందు నెడమ సగంబుతోఁ
గుడిసగంబె సాటిగాదుఁ జెలికి" (౧౮౨)

ఉపమతో శ్లేషించినట్లుండుట దీనియందలి యనన్యసాధారణమైన గుణము.

ఒక్క శృంగారమేకాదు ఈగ్రంథమందు దొరకురసము. భర్తృహరి, వేమన మొదలగు వారికి మార్గదర్శకములో యనునట్లుండు పద్యములనేకములు గలవు—

"ఆ. కలహములను గూడ నెలికిరా వాత్మలో
సమసిపోవు సాధుజనులు విన్న
మఱుఁగుమాట లొక్కమాఱుగ నాయువు
గడచినప్పు డగ్గిఁ గాలుఁగాని" (౨౦౮)

ఇట్టివే ౨౭, ౮౮, ౧౪౪, ౧౪౬, ౧౯౩ మున్నగు పెక్కుపద్యములు.

కాఁపువారికి వసంతమునకంటె వానకాలము ఎక్కువ హృద్యము. వర్షర్తువును గూర్చిన యిం-దలి కొన్ని పద్యములఁ దిలకింపుఁడు—

"ఆ. చూడు వింధ్యశిఖరి సొబగు! వర్షర్తుల
క్ష్మపయోధరములు మేనుసోఁక,
అన్నికడల మొలచుచున్న లేఁబచ్చిక
గుంపుపేరఁ బులకరింపఁ దొడఁగ" (33౨)

ఇట్లే 3౨3, 333, 33౬, 3౮3 ఇత్యాది.

రసబంధురమైన పద్యముల నన్నిటిని బీఠి-కలోఁ బ్రదర్శింపఁ జూచినయెడల వేఱుగా గ్రంథ

మునే ముద్రింపవలసి వచ్చెనని చెప్పనగును. భారతము "ప్రతి పర్వరసాస్పద" మందురు. ఇది ప్రతిపద్యరసాస్పదము. విరహమును ఎందరో వర్ణించియున్నారు. ఈ పద్యమెంత సుఖజనకమో యెంత సహజమో చూడుఁడు—

"ఆ. ప్రీతిపాత్రమైన పెండ్లాము వచ్చిన
యింటి పోడుసూచి యేడ్వలేక,
చనుడు పొలము విడిచి పనిలేకయున్నను
పాఘురుండు, కాఁపువాఁడు గంటు!"   (౧౧౦)

ఇఁక ప్రతిదిన జీవిత తంత్రమునకు ఈపద్య మెంతమంచి సూత్రమో అరయుఁడు—

"ఆ. సుగుణవంతురాలు, సుందరి, నిజమది;
నేను ఒనికిరానిదాన నిజము;
కాని యొక్క మాట; దానిఁబోలఁగలేని
వారలెల్లఁ జావవలయు నేమి?"   (౫౭)

దొరకినది గంభీరముగా ననుభవింపుము. ఊరక కొసరనేల?

మనవారిలో ఆశుకవిత్వమున్నదిగాని మొ-త్తముమీఁద ఆ పద్యములలో చమత్కారము పాండిత్యము ప్రకటనకు వచ్చినంత ఘనముగా రసము రాలేదు. ఈసప్తశతిని జదువునప్పుడు నేను

చిన్ననాఁడు విన్న యీపద్యము స్మరణకు వచ్చినది.

"జొన్నచేనిలోన సొగసుకత్తెను జూచి
నిన్నటాళనుండి నిదురరాదు;
దాన్ని నన్నుగూర్చి దయజూపు మాధవా
పొన్నపూలుదెచ్చి పూజసేతు"

ఒక్క పద్యములోననే హృదయ ప్రపంచమున భూకంపము పుట్టునట్లు చేయువారలలో జపానుదేశీయులు ప్రథములు. ఇట్టి కవితారచన వారిలో పారంపర్యముగ వచ్చిన సనాతన కళ. ఒకానొక స్త్రీ తనకొడుకు చావునకు విలపించిన విధము వినుఁడు—

"తే. తుమ్మెదలఁబట్టుచు మఱచి తొలఁగి యెటకుఁ
బోయినాఁడొకో నేఁడు నాముద్దుకొడుకు!"

జపానులో బాలుర క్రీడలలో తుమ్మెదలను బట్టుట యొకటి. చిన్న బిడ్డలు నిద్రపోయినట్లు శాంతముగ మరణింతురు. ఈ బిడ్డయు నేతొందఱయు నియ్యక ఆటకుంబతె వెళ్ళినాఁడా? ఆఁకలి పొద్దెఱుంగనివారు బిడ్డలు. కావున నింటికి వేళకు రాకపోయెనా? దారితప్పెనా? మఱియు మృత్యువు కట్టకడపటి స్థితియని ప్రేమ యంగీకరింపదు. సావిత్రి యట్లుచేయలేదు. ఎవ్వరును

చేయరు. పునస్సమాగమము సిద్ధించునను స్థిరమైన యాశయుండును. తమ్మునలఁ బట్టుచుఁ బోయిన కొడుకు మఱలవచ్చును. తల్లిని దలఁచుకొని రాకుండునా? ఎప్పుడు వచ్చునోయని తల్లి హృదయము వేఁగుచున్నది. ఎప్పుడైన నొకప్పుడు వచ్చుననుట సత్యము. ప్రేమ యమృతత్వము. సముద్రమున కంటె లోఁతైనది యీపద్యము. అనఁగా హృదయమెంతలోఁతో అంతలోఁతు. ధ్వనియను గుణమున్నదని మన సంప్రదాయము ప్రకారము చెప్పవచ్చును; హృదయమునందలి ప్రతి ఆక్రోశము యొక్కయు ప్రతిధ్వనిగూడ! అరబ్బులును ఇట్టి కవిత్వమునఁ బ్రవీణులు.

ఒక్కపద్యమే వ్రాయవలయును. అది మెఱుఁగుఁదీఁగవలె మనలఁ గ్రమ్మియుండు నంధకారమును ఒక్కక్షణము పోఁద్రోలి నూతనలోకమును హఠాత్తుగ గోచరింపఁజేయవలయును. ఆ లోకము ఒక్క నిమిషము మాత్రమెదుట నున్ననేమి? దాని రామణీయకము జీవమునంతయు నాక్రమించి చచ్చువఱకును తదేకధ్యానములో మునుఁగునట్లొనరించును. అట్టిదియె కవిత. గుణము ప్రధానము. రాశి కాదు.

ఈ గాథాసప్తశతి బౌద్ధయుగమునాఁటి యుత్కృష్టజీవితమును దెలుపుచున్నది. భావములు కోమలములు. వానికిందగినది అనంతకృష్ణశర్మ గారి శైలి. మధురము; లలితము; రమణీయము. వీరి సరసత్వము అర్హతకొలఁది పొగడుట అసాధ్యము.

తినుకొలఁది ఆఁకలి! ఇంకను ఇట్టి గ్రంథముల శర్మగారు వ్రాసి తనివిదీర్పఁ బ్రయత్నింపరేని మనకుఁ గష్టము గల్పించిన వారగుదురు. ఆ పాపమునకుఁ బాల్పడ కుందురు గాత!

పద్మప్రభాస
చిత్తూరు
22—9—31.

కట్టమంచి రామలింగారెడ్డి.



శాలివాహన

# గాథా సప్తశతీ సారము.

---

తే. అలుకమైయి జేవురించిన యాదిశక్తి
మోముఁ జందురు నీడ లో మొలచి యుండఁ,
బూజితాంబర దాల్చిన పోల్కిఁ బోలుచు
హరుని సంధ్యా జలాంజలి కెరగుఁడీరు. ౧

(హాలుఁడు. ౧ శతకము. పద్యము ౧)

క. చెవులకమృతంబు ప్రాకృత
కవనము చదువంగ వినఁగఁ గానని వారల్
పువువిల్తు శాస్త్ర మర్మము
వివరించెద రెట్లు సిగ్గువిడిచి [illegible]? ౨

(౧—౨)

క. మనయూరికొక్క సొమ్ముగఁ
గనుపండువు సేయుచున్న కమలవనము, కో
సిన నువ్వుఁజేనివలె, మం
చునఁ జెడిపోను దంట్లుమిగిలి చూచితి వత్తా! ౩

(కుమారిలుఁడు. ౧-౮)

ఆ. పండి తెల్లఁబాఱు వరితోఁటలను జూచి
యేల మొగము వంచి యేడ్చెదమ్మ?*
చూడు; జనుపచేను సొగసయ్యె, హరిదళం
బలఁదుకొన్న యాటవెలఁది వోలె. ౪

(మహిందుఁడు. ౧-౯)

ఆ. అడుగుఁదమ్ములందుఁ బడివేఁడు పతిపిఁప్పుఁ
జిన్ని కొమరుఁడెక్కి చెలఁగి యాడ,
అలుక యెంత తెగనిదయ్యును నిల్లాలి
మోమునందు నవ్వు మొలచె నప్పుడు. ౫

(మగ్గసామి) (సిరిరాయఁడు?) ౧-౧౧)

* రహస్య సంకేతస్థానముగా నుండినది యిఁకఁ గొన్నాళ్ళలోనె కోసి వేయుదురే యని యేడ్పు. ఇఁక ముందనేక పద్యముల కిదే భావము చూడవలయును.

తే. చక్కఁగాఁ జూడనేర్చు నాజాణ; నిజము;
తనకు సరివారి యెడఁగదా తగును వలపు;
ఇంక నది చావనిమ్ము! నిన్నేమియనను;
దానిచావైన మెచ్చుకోఁదగును జూవె! ౬

(దుర్గసామి. ౧-౧౨)

ఆ. వంటయింటి పనుల నంటిన మసిచేయి
సోఁకియుండఁ జంద్రసుందరముగ
నింపు గొల్పుచున్న యిల్లాలి మోమును
భర్త నవ్వుచున్నవాఁడు చూచి. ౭

(పోలుఁడు. ౧-౧౩)

తే. పూని యూఁదెడు నెఱజాణ! పొయ్యిమీఁద
నలుక గొనఁబోకు; రక్తపాటల సుగంధ
మైన నీయూర్పుఁ జవులకు నాసగొనుచు
పొగలెగయుఁగాని మండదీ పొయ్యి నగ్గి. ౮

(భీమసామి. ౧-౧౪)

ఆ. చెలులు చెంతఁజేరి తొలుచూలి పైకల
"నేమి కోర్కె నీకు; నెఱుఁగఁ జెప్పు"
మనుచుఁ గ్రుచ్చి యడుగ, నందంద దయితుఁడౌ
మగనికడకె పాఱె ముగుద చూడ్కి. ౯

(గయసింహుఁడు. ౧-౧౫)

కం. అమృత మయరూప! రజనీ
రమణీముఖతిలక! యంబర శిఖామణి! చం
ద్రమ! ప్రియుని మీఁదఁ బఱపిన
హిమకరపములె యిపుడు నాపయింబఱపఁగ దే!

(హాలుఁడు. ౧-౧౬)

తే. "అతఁడు పరదేశముననుండి యరుగుదెంచు;
నేను గోపింతు; నన్నారడించు నతఁడు."
అనుచు దయితుల యెడలఁ బేరాసలెల్ల
నెవరికో యొక్కరికి ఫలియించుఁ జెలియ! ౧౧

(సిరిధమ్మియుఁడు. ౧-౧౭)

తే. దొంగ నిద్దుర వ్వాఁడ! ముద్దుగొనినట్టి
చెక్కిళుల రేగు పులకల చెలువుఁ గంటి!
పల కనుమూసికొనెదు? చోటిమ్ము కొంత;
మసలియుండను లెమ్మిట్లు మరల నెపుడు. ౧౨

(చందసామి. ౧-౨౦)

ఆ. ముగియకున్న నేమి సొగసులు? పొమ్మల్లె
వలచి వేచియున్న వానికడకు;
వలపువేఁడి చల్లఁబడెనేని మఱి వాని
భావమందుఁ దగులలేవు బిడ్డ! ౧౩

(కాలిరాయఁడు. ౧-౨౧)

ఆ. చేరి సంతసమునఁ జెక్కు-ళ్ళు వికసింప
నాజ్ఞలిచ్చు రాత్రులందు నాకు;
పగలు వంచియున్న మొగమెత్త; దదెయిది
యనుచుఁ జెలిని సమ్మొటరిది చూడ! ౧౬

(మయూరండుఁడు. ౧—౨౭)

ఆ. నెమ్మి రాత్రి సగము నిదురమబ్బునఁ జేతఁ
దడవఁ బ్రిక్క- వట్టి పడుక తగులు
గాసి ననుభవించి కౌస; వట్లుండిన
నిట్టులలిగి యుందువెట్లు? చెపుమ. ౧౭

(అర్ధరాయఁడు. ౧—౨౮)

తే. వెఱచి నడచెదు భార్యకు, వేఁపచేదుఁ
గుడుచు పురువట్లు, పెదరెడ్డి కొడుకవయ్యు;
కఠిన! నిను జూడఁగల్గుటే కష్టమయ్యె;
ఐన నూరెల్ల నీకోసమలసి పడెడు! ౧౮.

(హారియాలుడు-శాలికుఁడు? ౧—౩౦)

తే. కత్తి యమ్ముల పోటులఁ గాయగాచి
మొగుడు దిగుడైన మగని పేరెదను, రేల,
రెడ్డికోడలు చక్క- నిద్రింప లేదు;
గాని యూరెల్ల హాయిగాఁ గన్నుమూయు. ౧౯

(అంగరాయఁడు. ౧—౩౧)

ఆ. ఇంత గొప్పగుణము నింకెవ్వరును నేర
రవని నీవుదక్క నందకాఁడ!
నేటివారికెల్ల మాటలో నొక్కటి,
మదిని వేఱయొకటి యొదవు చుండు.* ౧౮

(భోజయుఁడు. ౧-౩౨)

ఆ. పెడమొగంబు వెట్టి పడుకన్నై నేనుండ
వేఁడి యూర్పులిట్లు వెనుకనూర్చి,
మొదలు వగలఁబెట్టి యెదఁగాల్చినదిగాక,
యేల వీఁపుఁ గాల్చెదిపుడు పోర? ౧౯

(అనంగుఁడు. ౧-౩౩)

ఆ. మలిన చిత్తుఁడైన మఱఁదికి నిల్లాలు
గోడమీఁద వ్రాసికొన్న యట్టి
రాము వెంటఁ దిరుగు సౌమిత్రి చరితంబు
చిన్ననవ్వు దోఁపఁ జెప్పి చూపు. ౨౦

(హాలుఁడు. ౧-౩౫)

* ఇంకొకతె పేరుపెట్టి మఱచి తన్నుఁబిలువఁగా మగనిని గం
భీరముగ నొకతె యిట్లు చివాట్లు పెట్టినది.

ఆ. రమ్యమైన రూపు; రమణుఁడూరను లేఁడు;
పేదఱికము; పెద్ద వీథి నిల్లు;
పరువమైన వయసు; పొరుగింటి చెలి జార;
యైన నౌర? చెడదు చాన; చూడు. ౨౧

(మహీలుఁడు-మల్లోకుఁడు? ౧—౩౬)

తే. కొండ సెలయేటి సుడికిఁ జిక్కుకొని కలఁగి
తిరుగుచును, కేసరంబులు విఱిగి పోవ,
కొంత మునుఁగుచుఁ దేలుచుఁ గొదమ తేఁటి
వెంట నంటఁ, గడిమి పూవు వెళ్లిఁబోయె. ౨౨

(అవటంకుఁడు. ౧—౩౭)

ఆ. ఇంటి పెద్దతనము నెచ్చుగా మన్నించు
పేదమగని పరువుపేరు నిలుప,
వైభవంబుతోడ వచ్చెడు తనదు చు
ట్టాలకైన నలుగు నతని గృహిణి. ౨౩

(చుల్లోగుఁడు. ౧—౩౮)

తే. పతి ప్రవాసంబుపో నెడఁబాటు నోర్వ
కడలు పొరుగింటి చెలియ నూరార్చు చుండి
ప్రియుఁడు వశుఁడయ్యెఁ బందుగ వేళయయ్యెఁ
దాను గైసేసికొని యాతరుణిఁ గంటె! ౨౪

(రవిరాయుఁడు. ౧—౩౯)

తే. నీవు వసియించు చోటని నెమ్మనంబు,
తనకు నివి నిన్ను జూపినవనుచుఁ గనులు,
నిన్ను నెడఁబాసికద యివి సన్నగిల్లె
ననుచు నంగమ్ములును, బ్రియమయ్యెఁ జెలికి. ౨౫
(ముద్దఁడు. ౧—౪౦)

ఆ. చెలిమి మంచితనము వలపును గలచోటఁ
దగుల మెవరికైనఁ దగునుగాని,
మనసు లేనిచోట మనసు నిల్పుట నగుఁ
బాటు చూవె చూచువారికెల్ల. ౨౬
(హాలుఁడు. (నాథా?) ౧—౪౧)

క. సిరియొ మరణంబొ కలుగును
మఱవక పనిపూనిచేయు మగవానికి; సో
మరికిని గలదామరణము;
సిరి యొక్కటి వానికెపుడు చేకురదింతే. ౨౭
(వల్లహుఁడు. ౧—౪౨)

క. పొరుగూరికేగు దయితుల
విరహము సైఁపనగు నాశవెట్టుకొనుచు; న
మ్మరొ! యున్నయూరనే యీ
కరణి వలస * చావు మేలుగా యనిపించున్. ౨౮
(అమియఁడు. ౧—౪౩)

---

* వలస యనుపదము ప్రవాసము అనునర్థమున నిందు పలుమాఱు వాడితిని. కారణము అంతకంటె మంచిపదము తెనుఁగున నాకు స్ఫురింపమియే.

ఆ. రాతిమనసుతోడ నాతఁడు తేపూరు
వదలిపోవు ననెడు వార్తగలిగె;
వానికెపుడుఁ దెల్లవారకయే యుండ
రాత్రి తల్లి! పెరిగిరావె నేఁడు! ౨౯

(నిప్పులుఁడు-లంపుఁడు! ౧-౪౬)

తే. వీడుకొనువేళ జీవంబు వెడలకుండు
మర్మమేమని యడుగుచు మలయసాఁగె,
విరహమోర్చెడి సతుల మందిరము లూరు
వదలి పోవంగ వలసిన వాని గృహిణి. 30

(సింహుఁడు. ౧-౪౩)

క. మావానికితరవనితల
సావాసము గలుగునట్లు సవరింపవె యో
దేవ! యెపుడు నొక వస్తువు
నే వలచిన మంచిచెడ్డ లెఱుఁగరు పురుషుల్. ౩౧

(అనిరుద్ధుఁడు. ౧-౪౮)

తే. దూరమునుండి యెన్నఁడు దొరకనట్టి
వాని దోడ్తెచ్చితివి క్షేమవార్త గొఱకు;
ఎంత మేలొనరించితి? వింకఁ బ్రాణ
మేని గొనిపొమ్ము జ్వరమ! నిందింపనిన్ను. ౩౨

(సగ్గవమ్ముఁడు. ౧-౫౦)

తే. తగ్గియున్నదో తగ్గదో దాఁగిఁబోవు
వారి కందఱికేల నాజ్వరముచింత?
బుగులుకొను వాసనలతోడి సొగసుకాఁడ!
నన్ను దాఁకకుమా తెప్పల్గొన్నదాని! ౩౩

(కాలుఁడు. ౧-౫౧)

తే. కన్నులారఁగఁ దప్పఁ గన్గొన్న పిదప
తెగినదానిని మరల సంధింతురేని,
కాఁచి యార్చిన యుదకంబుకరణి, మిగులఁ
జప్పనైపోవుఁ బ్రేమంపుఁ జవులు చెలియ! ౩౪

(పమ్మహాఁడు. బ్రహ్మచారి? ౧-౫౩)

తే. ఊఱుమునకు నెక్కుడై వెన్క మొఱయు మగని
వింటి పెనుమ్రోఁత నొకమాఱు వినినయంత,
చెఱఁదగిలిపోవు జవరాలు వెఱపులుడిగి
తోడి పొలఁతుల కన్నీళ్ళుగూడఁ దుడిచె! ౩౫

(కర్ణుఁడు. ౧-౫౪)

క. చెడ్డమనసుగలిగి యడ్డాడు మరఁది బా
ధలను దెగువగల్గు దయితుతోడఁ
జెప్పదింటి బ్రతుకు చెడునంచు మదిలోన
యడఁచి నవయుఁ గోడలార్యశీల! ౩౬

(మండహావుఁడు? ముగ్ధదీపుఁడు. ౧-౫౯)




క. తలఁపున దయితుని గని, యె
న్నలయించుట లెంచి వివశయగుచు బయలుతోఁ
గలహించు ముగుదఁగని నె
చ్చెలులెడ్చిరిగాని పరిహసింపరు కంటే! ౩౮

[మండపేవుఁడు? ముగ్ధదీపుఁడు ౧-౬౦]

క. వలనడుమును సాఁగిన పో
గులలో మీఁగాళ్ళు దవులుకొన సాలెఁడిం
పలరెఁ, గనరాని దార
ముల్మలఁ గూర్చినయొంటి పోగడపువు లెఁగంటే

(పాలితుఁడు-కాలితుఁడు? ౧-౬౩)

ఆ. గోపురంబుమీఁదఁ గొంత తోఁచెడు మేకు
చెంతఁ బావురములు చేరి యుండఁ
జూడు! దేవళంబు శూలమెక్కించిన
బాధనోర్వ కేడ్చు పగిదిఁదోఁచు. ౩౯

(ప్రవరసేనుఁడు. ౧-౬౪)

ఆ. వాఁడు నిన్ను వలచి వరియింపఁజేసిటు,
క్రొత్త జున్నుపాలు గుడిచినట్టు
మెనుపదూడ వోలె, నేల నిద్రించెదు
పగటిపూట నోడలు ప్రాలుమాలి? ౪౦

(మహారాయఁడు. ౧-౬౫)

ఆ. కన్నుమూయకుండఁ గడపెదు దీర్ఘహే
మంతరాత్రులెల్ల మగువ యిట్లు!
పెక్కుదినము లయ్యెఁ బ్రియుఁడూరలేక; నీ
పగటిపూట నిద్ర బాగుగాదు. ౪౧

(కంఠేసరుఁడు. ధీరుఁడు? ౧-౬౬)

ఆ. "నడవలేని మగువ యడుగును దాఁటు నా
యడుగులందె యడుగు లిడినదంతె!"
యనెద వందకాఁడ! యట్లైన నీదు మే
నెల్ల నిట్లు పులకరింపనేల? ౪౨

(చదురాయఁడు. ధీరుఁడు? ౧-౬౭)

ఆ॥ పాఁపకడెము మిగులఁ బైనికి నెగఁద్రోచి
పరమశివుఁడు కేలు పట్టినప్పుడె,
చెలులు పెండ్లివేళఁ దెలియఁగల్గిరి గౌరి
భాగ్యగరిమ యెంతపాటి దనుచు. ౪౩

(అనురాగుఁడు. ౧-౬౯)

తే. వింధ్యగిరిమీఁద వేసవివేళఁ దగులు
కాఱుచిచ్చుల పొగలవికాని, కావు
వానకాలంపు నూతనాభ్రమ్ము; లూర
డిల్లియుండుము మగఁడూరలేనిదాన! ౪౪

(వద్ధావహి? అనురాగుఁడు ౧-౭౦)

ఆ. వెలితి పుట్టకెంత నిలుపుకోఁగలవొ నా
కంత యిమ్ము ప్రేమ మదియ చాలు;
సొగసుకాఁడ! వలపు ముగిసినప్పటి వంత
లోర్చి యెల్లవారు నుండలేరు! ౪౫

(ముగ్ధసీలుఁడు. ౧-౨౧)

తే. వలపు పలువురపైఁ గల్గువాని చెలిమి
కష్టపడి యైదుపూటలు గాంచినట్టి
వనిత యాఱవపూటకు వాయివిడువ
నేల? దండిగ నెట్లుబ్బు మేలితిండి? ౪౬

(అలయుఁడు. ౧-౨౨)

ఆ. తెప్ప వాల్పకుండఁ బ్రియుఁడు నాయుంగంబు
లందు చేనిదేని నరయుచుండు
దాని దానినెల్లఁ దవిలి మూయుచుఁగాని
యతఁడు చూడవలయుననియె వలతు! ౪౭

(వసంతకుఁడు. వసలకుఁడు? ౧ ‥ ౨౩)

ఆ. మగని తప్పుపనుల మనసెంత నొగిలినఁ
గాని వాని మీఁది దానియలుక
సడలి కాఱిపోవఁ దొడఁగెను, బిడికిటఁ
బట్టుకొన్న యిసుక పగిదిఁ, జూడు? ౪౮

(మొత్తాహలుఁడు. పవులిన్యుఁడు? ౧ ౨౪)

క. చిలుకలచాలదె కను గొం
తుగా డె! లలితగ్గతి దిగియెడిని నేలకు, ని
మ్ముల గగనలక్ష్మి మెడఁ బ
చ్చల కెంపులకంటె తప్పి జాఱెడు ననఁగన్. ౪౯

(౧—౭౫)

ఆ. బాధపెట్టలేదు పరదేశ వాసంబు
గాని పేదఱికముగాని నాకు;
కోరినట్టికోర్కి గూడక చెలికాండ్రు
వచ్చినట్లె పోవ నొచ్చె మనసు. ౫౦

(భోమవిక్రముఁడు. ౧—౭౬)

ఆ. పల్లెలందు గడ్డిపఱపుల, వనమందు
కాఱుచిచ్చుసెగల, కాపు దొరకె;
పట్టణమునఁ జూడు! పాంథునిపైఁ జలి
కసిని దీర్చుకొనెడు కరణిఁ దోఁచు. ౫౧

(వినయాయితుఁడు. ౧—౭౭)

తే. పసపుసిళ్ళాడి దువ్వెన పండ్ల నడుమఁ
జిక్కుకొనియున్న నైలను జిన్నముల్లు
గ్రుచ్చి తీసెద; వెవ్వనికోర్కి పండఁ
జేయనున్నావు తెల్పవే చిన్నదాన? ౫౨

(మకరందుఁడు. ౧ ౮౦)

తే. ఈవు దాక్షిణ్యమునకయి యిటకువచ్చి
యున్న నింతటి సుఖమగుచుండు మాకు;
ఇంక మనసార నెవ్వరినేఁగి చూతు
వట్టివారల సుఖమెంతో యందకాఁడ! ౫౩

(ఆదివరాహహాలుఁడు. ౧-౮౫)

తే. కొట్టినొచ్చిన యొకచేయి వట్టియతఁడు
వేగ నూర్పులగాలిచే విసరఁబోవ,
నేమి చేయుదు! నవ్వుచు నేనువానిఁ
గౌఁగిలించితిఁ బెఱచేతఁ గంఠమందు. ౫౪

(పహాయీ. ౧-౮౬)

తే. అలిగి పెడమోముఁబెట్టి నీవరుగుచున్నఁ
గాని మానిని! నీవెంటఁ గదలివచ్చు
మగని ప్రిక్కన యున్నది మనసటంచుఁ
బులకరించిన నీవీఁపె తెలుపుచుండె. ౫౫

(రేవా. ౧-౮౭)

తే. ఊరడింపుల దిగఁబాఱియున్నఁగాని
యలుక యింకను మిగులుటఁ దెలుపఁగల్గె
లేమ, పతిచెంత నెవ్వరు లేనిచోటఁ
గూడ మరియాదనడతలతోడ మెలఁగి. ౫౬

(గామవుజ్జుఁడు. ౧. ౮౮)

క. చేసియున్నయవియొ, చేయుచున్నవో, యింకఁ
జేయునవియొ, నీదు చెట్టలందు
సరిగఁ జెప్పుమేవి మఱచి పోమ్మనెదవు?
సొగసుకాఁడ! సిగ్గుదెగిన వాఁడ! ౫౭

(రేవా. ౧-౯౦)

తే. తమ ప్రభుత్వంబు నెఱపక, దాసులవలె
సలిగినప్పుడెల్ల నోదార్యఁ గలుగువారె
క్షితి పాత్రులు సతులకు; లాఁతివారు
వట్టిభర్తలు-తరముగానట్టి వారు. ౫౮

(మాధవి. శాలకుఁడు? ౧-౯౧)

క. ఆసదీఱనింక సతని జూడఁగవలె
సత్తె! యొక్కనిముసమప్పుడుగన్నఁ
గనుల దప్పియైనఁ గడవదు, కలలోన
దాహమెత్తి నీరుద్రాఁగినట్లు. ౫౯

(వజ్రుఁడు. ౧-౯౩)

క. ఉన్నయన్నినాళ్ళు నొక సొమ్ముగానుండి
వజ్రుఁడు వదలిచనిన చోటు,
పెద్దమఱ్ఱిమ్రాను పెల్లగించిన వేళఁ
బల్లటూరి పక్కబయలుఁ బోలు. ౬౦

(హారకుంతుఁడు. ౧-౯౪)

ఆ. మావిచివురు మేసె; మద్యంబు మూర్కొనె;
మలయమారుతంపుఁ జలువ దాఁకె;
ఇంకెయయ్యుఁ బనులె యెక్కువై ననువీడి
యేగె నత్త! యెవరికెవరు వలయు? ౬౧

(కొంతక్షురుఁడు. స్థిరసాహసుఁడు? ౧—౯౭)

ఆ. తనవి దీఱకుండఁ గనుఁగొనఁదగి యుండి,
మనసు మనసుగలిసి, మంచి తనము
నూని, సుఖము దుఃఖ మొకటిగ మనువారి
పొందుగనుట పెద్దపున్నెమిలను. ౬౨

(వజ్రుఁడు ౧—౯౯)

ఆ. ఎవరికెవరు గూర్తు రిలను వారికి వారు
నోఁచినను సుఖంబు నించఁగలరు;
దయితు గోటికాలు దగిలినఁగూడఁ బా
లిండ్లఁ జెలికిఁబులక లెగయుఁగాదె! ౬౩

(సిరిసత్త్రియుఁడు. ౧—౧౦౦)

తే. కొమ్మకొనపయి గూఁటిలోఁ గూర్కుచున్న
తనదు పిల్లలఁ గాఁపాడుపనియె తలఁచి,
మునిఁగి పోవుదుననుభీతి గొనక, కాకి,
వెడలాడిని గంటె! చెట్టుపై వెల్లివెంట. ౬౪

(మాణుఁడు. ౨—౨)

క. చూడలేక యేడ్చుచును * గట్టి కడపటి
యిప్పపూలఁ జెడిపె యేఱుచున్న
నదిగో చూడు! చచ్చినట్టి చుట్టము నెమ్మ
కలను వెదకునట్లు కాటినడుమ. ౬౫.

(సిరివలుఁడు. ౨-౪)

ఆ. చిన్నవాఁగువడికిఁ జిక్కి కొట్టుకపోవు
పాడుగుకట్టెవోలె నడుమ నడుమఁ
దగులుకొనెదు; మనస! తప్పక యెవ్వఁడో
కడకు నిన్నుఁబట్టి కాల్చివైచు. ౬౬.

(మహాదేవుఁడు. ౨-౫)

తే. మగఁడు గోదావరీ తీరమార్గమందు
మలయఁగాఁ జూచి కాఁపుకోడలు మిటారి,
కాలువెట్టిన బాఱుదుర్గమపుఁ జోట
నేటిలోనికిఁ బో దిగియెడిని గంటె? ౬౭.

(అవియకణుఁడు? అలికుఁడు. ౨-౭)

---

* ఇప్పపూలను ఏఱు నెపమున నాచోటు సంకేతస్థానముగా నేర్పఱచుకొని యుండెడిది. పూలకాలమైపోయినది. అందుకై యేడ్చుట.

ఆ. నేఁడుగూడ మఱవనేరను నాపాద
ములకు మాటలేక మ్రొక్కియుండ,
కాలిబొటనవ్రేల గట్టిగా వాని పె
న్నెఱులఁ జుట్టి యీడ్చు పరమ సుఖము. ౧౮

(భ్రమరుఁడు. ౨—౮)

క. కలఁగవు కమలంబులు; హం
సలుగదలవు; చూడవమ్మ చక్కఁగ నెవరో
తలకిందుగ నాకాశము
నిలిపిన వార్త! చెఱువు నీళులలోనన్. ౧౯

(మియంకుఁడు ౨-౧౦)

ఆ. వలసమాట యెవఁడు తెలిపెనో యెఱుఁగనే,
వానిమనసు పాడుగాను! నేఁడు
విన్న మొదలు విసము గొన్నట్లు కోడలి
యవయవంబులెల్ల నవయసాఁగె. ౨౦

(మియంకుఁడు. ౨-౧౧)

క. 'బాలుండింకను మా గో
పాలుం' డనుచును యశోద పల్కఁగ విని, విద
గ్ధాలోకమ్ములఁ గృష్ణున్
లాలించుచు సద్దులేక నవ్విరి వ్రేతల్! ౨౧

(విధివిగ్రహుఁడు. ౨-౧౨)

ఆ. తోడిగొల్లపడఁతు లాడు నాట్యము మెచ్చి
నెపముతోడఁ జెంత నిలిచి, జాణ
యొక్కవేల్త, వారి చెక్కుటద్దములందు
మొలచు కృష్ణునీడ ముద్దుగొనియె! ౨౨

(గువరుఁడు? ౨-౧౪)

తే. దరుల నిండఁగ నొండొంటఁ దవిలి, దిశల
నలమికొనియున్న మేఘమండలము మరల
విచ్చుకొని పోవఁగంటిరే! వింధ్యశిఖరి
గవుసెనను దీయుచుండెడు కరణిఁ దోఁచె. ౨౩

(కమలుఁడు. ౨-౧౫)

ఆ. చెంచుమగలు ముదముచేఁ జూచుచున్నారు
పిండ్లనూని శిఖరవీధి నిలిచి,
మత్తగజములట్లు క్రొత్తమేఘంబులు
ప్రాఁకుచున్న వింధ్య పర్వతమును. ౨౪

(హాలికుఁడు. ౨-౧౬)

ఆ. కాఱుచిచ్చుపొగలఁ గాఱ్కొన్న వింధ్యంబు
పోలిచె ధవళమేఘ పూర్ణమగుచు,
కడలిఁ దఱచువేళఁ గ్రమ్మిన పాలతుం
పురులనిండు చక్రధరుఁడు వోలె. ౨౫

(హాలుఁడు. ౨-౧౭)

ఆ. చుట్టములు నశింపఁ జూచి యేడ్చుచు నున్నఁ
బరమ వీరుఁడనుచుఁ దరుణచోర
వరుని వలచిచూచెఁ జెలఁగొన్న వాల్గంటి!
గుణము నెవరు మెచ్చుకొననివారు? ౭౬

(హాలుఁడు. ౨-౧౮)

ఆ. చెంచు మగువయింటి చెంగటఁ జెక్కిన
మగనిపెద్దవింటఁ దెగిన చిఱుగు
పొట్టు మింటికెగిరి పోయెడు సుడిగాలి;
దాని భాగ్యగుణ పతాక యనఁగ! * ౭౭

(హాలుఁడు. ౨-౨౦)

తే. క్రొవ్వియేన్గులు రాయుచెక్కుల మదంబు
గ్రమ్మి మాసిన కానుగుఁ గొమ్మలపుడు
చూచి, పుట్టింటి నుండి వచ్చు నడితోవఁ
జెంచిత యెఱింగె 'మగఁడు గతించె'ననుచు ♦

(గంధరాయఁడు. ౨-౨౧)

---

* వలపు మక్కువయెక్కువై దౌర్బల్యముచే మగఁడిదివఱకుఁ దానుపయోగించుచుండిన పెద్దవింటిని మోయలేక చెక్కి సన్నబఱిచెను. అదే చెంచిత సౌభాగ్యము దెల్పును.

♦ మగఁడు బ్రతికియుండినచో నాచోటికి ఇంతనిర్భయముగా ఏనుగులు రావని యది యెఱుఁగును.

క. తొలుకాన్పువేళఁ గల నొ
ప్పులు పడఁగాలేక ముగుద, 'పొండు! మగనిమా
టలు చాలునింక నా'కని
పలుకుచు నవ్వించె నచటి వారల నెల్లన్. ౭౯

(అణురాయఁడు ౨—౨౩)

ఆ. అత్త! మనుజజాతులందు వంచనలేని
వలపు లెందులేవు తలఁచిచూడ;
ఉండెనేని పాసియుండు వారెవ్వరు?
పాసియున్న నెవరు బ్రదుకఁగలరు? ౮౦

(రాముఁడు. ౨-౨౪)

తే. దానిపై నీకువలపు; నీపైన నాకు;
నిన్ను నదియొల్ల; దొల్లవు నన్ను నీవు!
చిన్నవాఁడవు నీకేమిచెప్పఁ! బ్రేమ
పలు వికారములనియెడు పలుకు నిజము. ౮౧

(ఉజ్జయుఁడు. ౨-౨౬)

క. చెలికత్తెలు కడు జాణలు;
వలపులు తలమున్కలగును వానికి; నే సి
గ్గుల దాన; నింక నా పద
ముల లత్తుకవన్నె లేల పూసెదు? పోవే! ౮౨

(౨—౨౭)

క. సురభి సమీరాహత బం
భరనాదము నిండు నడవిఁ బాంథుల మనముల్
కరఁగఁగఁ బాడుచు నున్నది
చిరవిరహాప్తుఁ బాట గొల్లచిన్నది కంటే! ౮౩

(సాలియుఁడు. ౨—౨౮)

క. వలదన్నను భర్త పదం
బులుగాని యిల్లాలు సంజప్రొద్దున నింకన్
వెలుఁగుండఁగానె కడిగెడుఁ,
దలఁపెఱిఁగి యతండు నవ్వఁ దానును నగుచున్.

(హాలుఁడు. ౨-౩౦)

ఆ. పిలువనిండు దానిపేరుపెట్టియె నన్ను;
చెప్పి ఫలములేదు చెలియలార!
అతని మీరలేమి యాడకుఁ; డెందైన
నొక్కమనసుతోడ నున్నఁజాలు. ౮౫

(కుసుమరాయఁడు. సోమరాజు? ౨—౩౧)

తే. కనుల రూపంబు, తాఁకుడు తనువునందు,
చెవుల వలపులమాటలు, చిత్తమందు
చిత్తమును నాఁటినట్లు నిల్చినవి; దైవ
మిందు మమ్మెడఁబాపినదేమి చెప్పుమ? ౮౬

(బ్రహ్మగతి. ౨—౩౨)

ఆ. కనులు మూసికొనుచుఁ గాంతుఁడు తనచెంతఁ
జేరినట్లు తలఁచి సెజ్జమీఁద,
కలికి, సడలినట్టి గాజుల కేలు సా
రించి తన్నె కౌఁగిలించుకొనియె! ౮౭

[బ్రహ్మ గతి? ౨-33]

ఆ. లోభివాని చేతిలో సిరి యెంతగా
వెలయుచున్న సుంత ఫలములేదు;
తెరువు నడుచువేళఁ గఱకు వేసవి యెండ
మాఁడు వానికిఁ దనసీడవోలె. ౮౮

(కుందపుత్తుఁడు. ఉజ్జయుఁడు? ౨-3౬)

ఆ. అదిరె డెడమకన్ను! యందుకు ఫలముగా
నిపుడు ప్రియుఁడు వచ్చునేని యిటకు,
కోర్కెదీఱునట్లు కుడికన్నుమూసి నీ
తోన చాలసేపు వానిఁజూతు! ౮౯

(సత్త్రిహాత్థి. ౨-3౭)

ఆ. వేఱు వేఱు పువ్వులసారంబు చవిచూడఁ
దలఁచి గండుఁదేఁటి మలయుటెల్ల,
దాని తప్పటంచుఁ దలఁపకు, తేనెలు
లేని కుసుమములది గాని, చెలియ! ౯౦

(అణురాయఁడు. ౨-3౯)

ఆ. ఏడ్వఁగల్గుదాఁక నేడ్చెను; మేను కృ
శింపఁగల్గుదాఁకఁ జెడి కృశించె;
ఉసురు గల్గుదాఁక నూర్చె నిట్టూర్పులా
బిడ్డ, నీదువలపు వెట్టఁబట్టి. ౯౦

(వెరసత్తి. ౨-౪౧)

కం. సమసుఖ దుఃఖులగుచుఁ గా
లము గడచిన కొలఁదిఁ బ్రేమ లావుగ మను నా
లు మగలలో నొక్కరు
సమసిన నదిబ్రదుకు, బ్రదుకు చావితరులకున్

(వంతరంకుఁడు? ౨-౪౨)

తే. ఎలచివురుతోడఁ బ్రస్థాన కలశమందు
మొదటి మామిడి పూవుగుత్తి ముడిచినాను;
అడవి యేడ్వకు కూఁతురా! అదియు నీదు
ప్రియుని పరదేశయాత్ర వారింపఁగలదు * ౯౨

(వంతరంకుఁడు. ౨ ౪౩)

* మామిడిపూవు చూచినతోడనే వసంతము వచ్చెనని ప్రియాణము మానుకొనునని భావము.

ఆ. సందుచూచి చెలియలందఱుఁ జేరి నా
మనసునందు బలిమిఁ జొనిపినట్టి
యలుక ప్రియునిజూచి నప్పుడ నిలువక
మాయమయ్యె, దొంగమగని కరణి. ౯౩

(వలాయిచ్చుఁడు. ౨—౪౪)

ఆ. మనసునందు వలపు మాయుటఁ జేసి కాఁ
బట్టకుండ నొక్కపట్టునందు
నిలువకయ చలించు నీ యరచూడ్కులు
పెల్లగించుఁగదర యుల్లమెల్ల! ౯౪

(విజయగయి, ౨—౪౬)

ఆ. నిదురవడికిఁ జొక్కి కుదుట నిల్వక కన్నుఁ
గోనలందు నీడ్చికొనుచుఁ బాప
లలయు వాలుగంటి యరగంటి చూడ్కుల
యుదుటు మదనుఁడైన నోర్వఁగలఁడె? ౯౫

(హాలుఁడు. ౨-౪౮)

ఆ. విడువరాని వలపుముడి నెట్టులెట్టులో
ప్రాణమొకటి యుండఁబట్టి యుంటి;
పోదు మనస! యింకపయినైనఁ జాలింపు;
మెవరియందుఁ దగిలి నవయ వలదు! ౯౬

[అవజ్ఞాంగుఁడు. ౨-౪౯]

ఆ. అర్కమండలమున సకలంకమౌ చంద్ర
మండలంబు సొచ్చియుండు పగిది,
నెవని కౌస్తుభమునఁ దవులును లచ్చి నె
మ్మొగమ్ము, వానికీరు మ్రొక్కులిడుఁడు! ౯౭
[శశికలంకుఁడు. ౨-౫౧]

ఆ. ఓర్వరాని పతివియోగంపు అంపము
చీల్చుచున్నదాని చిత్తమునకు,
కంటె! యురముమీఁదఁ గాటుక కన్నీరు
కాఱుచుండెఁ గొలఁతదారమట్లు! ౯౮
[సాహిల్లుఁడు. ౨-౫౩]

ఆ. తగినచోటు గాదు దాఁచుటకిది; యేల
సాహసంబుఁ జేయఁజనెదు? కొడుక!
ఇందు దాఁచినట్టి హృదయంబులేమి చే
సినను మఱలినిన్నుఁ జేరరావు! ౯౯
[సాహిల్లుఁడు. ౨-౫౪]

తే॥ వలపు విఱుగుడు లెఱుఁగవు; వచ్చి 'సన్న
గిల్లితదియేల?' యని యడిగెదవు నగుచు;
చపల చిత్తముగల ప్రియ జనులు నీకుఁ
జిక్కినప్పుడు బదులు వచింతునోయి! ౧౦౦
[౨-౫౭]

ఆ. తెలుఁగుపాటఁగూడఁ జెవిని బెట్టక వేని
కొలుకు నాఁడు నిన్నుఁ దలఁచియుంటి
నట్టి, లిపిగొ నూడు మాసౌఖ్యములు,! ప్రా
ణములకై పరిభవించు ప్రస్త్రైనిపుడు! ౧౦౧

(దేవుఁడు. ౨- ౫౯)

ఆ. ప్రకొన్న చెరఁగు బలిమి నీడ్చుకపోవ్వు
కుపదాన! మెల్లనడచి పొమ్ము!
స్తనభారంబు మోయఁజాలని లేఁగౌను
కలఁకనియు నింత నెఱప వకట! ౧౦౨

(గుణాఢ్యుఁడు. ౨-౬౦)

ఆ. కేల్ప్కు పరిలించి కన్నగ నీళ్ళుద్రాఁగు
మన్నవాఁడదె తెరువరి కన్నులెత్తి;
అక్క చలిపందిరిని గాచు నతివగూడ
కన్నెగా ధారనింకను సన్నగించు! ౧౦౩

(భాగ్దయుఁడు. ౨-౬౧)

ఆ. భిక్షుకుఁడు నాభిపేక్షించుచుండఁగా
నదియు వాని మోము నరయుచుండె;
అతనిచేతి చిప్ప నామచేతులఁ దట్టఁ
గాకులేతి తినుచుఁగాకు చేసె! ౧౦౪

(నసిరాయఁడు. ౨-౬౨)

తే. ఎవని వదలిన జీవంబు నవసి చనునో
యతని నపరాధినయ్యు నోదార్పవలయు;
ఊరు గాలుచుఁ బొలివోవు చున్నఁగాని
యగ్గినొల్లని వారెవ్వ రతివ! చెప్పుము? ౧౦౫
(రోహి. ౨—౯౭)

తే. సోఁగకన్నుల నెవ్వనిఁజూతు? మెవని
తోడ మొఱవెట్టుదుము సుఖదుఃఖములను?
ఎవరితో నవ్వులాడుదు? మెందుఁగన్నఁ
బామరులు నిండియున్న యీ పాడుకొంప. ౧౦౬
(మోహనాయుఁడు. ౨-౬౮)

ఆ. పత్రిచేసు దున్నవలసి మంచిదినాన
మడక పూజచేయఁ దొడఁగి నపుడు,
కోర్కులాత్మ గుబులుకొన గడగడమని
వడఁక దొడఁగెఁ గాఁపు చెడిపె కేలు. ౧౦౭
(కపిలుఁడు. ౨-౬౫)

ఆ. నలువలఁకులఁ జేఁకటులు గ్రిమ్మ పెనుమబ్బె
మ్రానియాకు లెవ్వారైనఁ గోసి
కొంపురనుచుఁ జెడిపెలందఱు వానిపై
నిండఁ జల్లినారు పిండిగలిసి. * ౧౦౮
(అహారాయఁడు ౨-౬౬)

---

* కాకులు మొదలగు పక్షులు కట్టవేసిన వనుకొని కోయక వదలుదురని భావము.

ఆ. సొగసులీను దయిత మొగమును జూచుటం
యది యమూల్య సౌఖ్యమట్టులుండె;
పొలఁతి యుండుపల్లె పొలిమేరఁ జూచినఁ
జాలుఁ; గన్నుదోయి చల్లఁబడును. ౧౦౯

(౨ ౬౮)

ఆ. ప్రీతి పాత్రమైన పెండ్లాము సచ్చిన
యింటిపాడు సూచి యేడ్వలేక,
చనఁడు పొలమువిడిచి పనిలేక యున్నాఁడు
పాపుఁడుండు కాఁపువాఁడు కంటె! ౧౧౦

(పుండరీయుఁడు. ౨ ౬౯)

తే. పూరికొట్టము పెద్దగాడ్పునకుఁ జెదరి
లోన దిగువాన నీళుల నానకుండఁ,
గంటె! గోడపై వ్రాసిన గడువుదినముఁ *
చేతులడ్డముపెట్టి ప్రోచెడిని గృహిణి. ౧౧౧

(జయసేనుఁడు. ౨—౭౦)

---

* మగఁడు పరదేశమునకు పోవునప్పు డిన్నవనాఁడు వచ్చెదన
ని చెప్పిన దినము.

ఆ. ఇంటికాపు పెద్దయెనుఁబోతు నచ్చినఁ
దాని మోసికొనుచు దాని గంట
సరముఁ, దిరిగి తిరిగి సంతలన్నియుఁ, దన
కమ్మవారి చేవళమ్ము జేర్చె. * ౧౧౨

(నచ్చుసామి. ౨—౭౨)

తే. మత్తగజ కుంభములఁ జిక్కు ముత్తియముల
తొడవులను దాల్చు సవతుల నడుమఁ బాపు!
నెమలి యీఁకల సొమ్ములు నెత్తిఁ జిక్కు
పొగరుగాని పోవుచున్నదా బోయపడుచు!◆

(పోటీసుఁదు. ౨—౭౩)

క. వంకరచూపులఁ జూచుచు
వంకర పల్కులను బల్కి, వంకర నడతల్
వంకర నవ్వులు గలుగు శ
శాంకముఖులవలపు పుణ్యసాధ్యము కాదుగా!

(నవ్వుసామి. ౨—౭౮)

---

* దానివంటి దింకొకటి కొనవలయునని చూచినను దొరకక వేసరెనని భావము.

◆ తన్ను పెండ్లాడుటకు ముందు ఏనుగులను జంపుచున్న వాఁడి పుడు నెమళ్ళను జంపి బ్రతుక వలసిన స్థితికి వచ్చెను. చూ. ౭౬ వ పద్యపు టీక.

ఆ. ఇచ్ఛకొలఁదిఁ దిరుగుమింక; బైరాగి! గో
దావరీ తటమున దట్టమైన
పొదలఁజేరి యొక్క పొగరైన సింగ మా
కుక్కపోతునిప్పుడె కూల్చిచంపె * ౧౧౫

(౨ ౭౫)

తే. గాలిఁగదలిన చెవిమీఁది కలువనుండి
కంటరాలిన పుప్పొడిఁ గడకు నూఁదు
నప్పుడాశలు దీఱ ముద్దాడు భాగ్య
శాలి వెవఁడుర నీవు నిర్జరులలోన? ౧౧౬

(పాలితుఁడు. ౨ - ౭౬)

ఆ. నేను మాలిఁగాను; నీవును బ్రియుఁడవు
గావు; మనకు నిందుఁ గార్యమేమి?
కాని, యదినశించుఁ; గలుగు నీకపకీర్తి;
దానఁ జేయవలసె ధర్మబోధ. ౧౧౭

(అసులబ్ధ? ౨-౭౭)

---

* అక్కడ సింహమున్నది పోవలదని బెదరింపు మాట.

ఆ. ఎంతసాము చేసె నీతిలకం బౌర!
నెలఁత మొగమునుండి నీదు మొగము,
నీదు మొగమునుండి నాదుపాదములుఁ జే
సేత మార్చుకొన్నరీతిఁ జేరె! ౧౧౮

(హాలుఁడు. ౨-౭౯)

తే. చెవిని సొమ్ముగా నేరేటి చివురుఁ జెరివి
కాఁపుఁ గొమరుఁడు వీధిలోఁ గడచిపోవఁ
గంటె! నలుపెక్కెఁ గనులు నగంబు మూసి
కాంచు చామనచాయ వాల్గంటి మొగము *

(౨-౮౦)

ఆ. నీవు దప్ప నొరులు నేరరు చేఁదు మా
టలను మెతువుగాఁగఁ బలుక, దూతి!
దురద గోఁకునపుడు తో త్రెల్లఁ బడకుండఁ
గార్యమెల్లఁ దీర్పఁగలవు సుమ్ము! ౧౨౦

(ఆహవసత్తి. ౨-౮౧)

---

* నేరెటిమ్రానివద్ద సంకేతస్థాన మేర్పఱుచుకొని యున్న వేళను సరిగ కారణాంతరములచేఁ దానుబోలేక నిలువఁగా, నది సూచించుచు కాఁపుకొడుకు నేరేటి చివురు ధరించి దాని కనుఁలఁ బడెడునట్లు సంచరించెను. ఇట్లూరు నేయని దాని మొగము నల్లబడెను.

5

తే. నీదుమదిలోన వేవురు నెలఁతలుంట
నిలువఁగాఁ జోటుచాలక వెలఁది యిపుడు
అనుదినము నొంచుపనిలేక యందకాఁడ!
సన్ననౌ మేనినింకను సన్నపఱుచు. ౧౨౧

(హాలుఁడు. ౨-౮౨)

క. నిముసంబైనను నా హృద
యము విడిచనదెల్ల వేళలందును బలు తా
పము వెట్టుచు, దాఁచిన పా
పమునఁగలుగు నళుకువోలె, భామిని యకటా!

(హాలుఁడు. ౨-౮౩)

ఆ. ఊరకేల నన్నునోదార్చెదవు? కౌఁగి
లించికొనుము, కినుక లేదునాకు;
వెఱ్ఱివాఁడ! నీకు వెతఁబెట్టునేని యా
మానమైన నాకుఁబూననేల? ౧౨౩

(మియంగుఁడు. ౨-౮౪)

క. అలిగిన సజ్జనులగు వా
రల మనసులుఁబోలె, నీశరత్కాలమునన్
వెలుపల వేఁడిగలిగి లో
పలఁ జలువలనొప్పఁ గంటివా పెనుఁగొలఁకుల్!

(విగ్గహరాయుఁడు. ౨-౮౬)

తే. "వాఁడు వచ్చిన నేమి మాటాడవలెనొ?
యేమి సేయంగ వలయునొ? యెట్టులగునొ?"
యనుచుఁ దొలువొల్త సాహసమునకుఁ గడఁగు
నతివ హృదయంబు గడగడమని వడంకె. ౧౨౫

(౨-౮౭)

ఆ. పాదపతనవేళఁ బాంజీల కొంప్పలోఁ
జిక్కుకొన్న ప్రియుని చికురములను
వెలఁది మెల్ల మెల్ల విడిపించుటయె 'యల్క-
కరఁగి పోయె' ననుచు నెఱుకపఱచె. ౧౨౬

(అణంగుఁడు. ౨-౮౮)

క. తడఁబడు పల్కులు, కంపిం
చెడు మోవియు, నెఱ్ఱవాఱు చెక్కిళ్ళును నై
పడఁతి, 'ననుఁదాకవలద'ని
యుడుగని రోసమునఁ దొలఁగుచుండుట దలతుఁ.

(౨-౯౨)

ఆ. వానిమీఁదఁబడియె వనిత గోదావరి
జాలు రేవు దిగెడు సాకువెట్టి;
కనికరమునఁదప్ప కానరాదని వాఁడు
గట్టిగాఁగ దానిఁ గౌఁగిలించె. ౧౨౮

(౨-౯౩)

ఆ. ఈవుచేతులార నిచ్చినదని ప్రాఁచి
పూలసరము తావిపోయియున్న
నింతి దాల్చుచున్న దింకను, వ్రతపూజ
ముగియ నూరి వేల్పు బొమ్మవోలె. ౧౨౯

(౨-౯౪)

ఆ. ఎరవు తెచ్చుకొన్న తెలుఁగున వసముగా
కుండఁజెడిన యిట్టి యొడలుగలిగి,
అమ్మ! తప్పులెన్ని యతఁడు చేసిన నెట్టు
లలుగనేర్తు నవ్వులాటకైన! ౧౩౦

[పావచ్ఛీలుఁడు. ౨-౯౫]

ఆ. ఊరినిండ వయసువారు; ప్రియము; ముదు
సలి మగండు; నవవసంత వేళ;
ప్రాఁతవడినకల్లు చేతనున్నది! యింకఁ
జెడక చావఁగలమె? చెప్పవమ్మ! ౧౩౧

(హాలుఁడు. ౨-౯౭)

క. నీమాటలన్నియును నే
వేమఱుఁ జెప్పినను సరిగ వినలేదనుచుం
గామిని నాచేఁ జెప్పిన
దేమఱి చెప్పించుచుండు నెన్నియొ మాఱుల్

(సురభివేసుఁడు. ౨-౯౮)

ఆ. కలికి మంచితనముఁ జెలిమియు నుప్పొంగి
యెల్లరెఱుఁగ నిన్ను నెట్లు సూచె,
నట్లె యొరులఁగూడ నది చూచుచుండును
వినుము, గుట్టుదాఁచిపెట్టుకొఱకు. ౧౩౩

(మణిరాయఁడు. ౨—౯౯)

ఆ. 'ముద్దుఁగొడుకు మొదట మొలచిన పలుదోయి
గొఱికి కొఱికి కాటువఱిచె నిదిగొ!
రేఁగుపండుఁ గంటిరే!' యని పెండ్లాము
నగుచుఁ దెచ్చిపెట్టె మగనిచేత. ౧౩౪

(హారితపుఁడు. ౨—౧౦౦)

తే. ఒకరు సెప్పెడుమాట లట్లుండనిమ్ము;
నీదు హృదయంబె యిచ్చోట నీకు సాక్షి;
అలిగి చీవాట్లు పెట్టుటకైనఁ దగిన
యంత నెయ్యంబులేదు నాయందు నీకు! ౧౩౫

(వాహావుఁడు. ౩—౧)

ఆ. ఇచ్చుకొలఁదిఁ బరువులెత్తెదు; దుర్లభుఁ
డైనవాని కొఱకు నాసగొనెదు;
ఆకసంపుఁ ద్రోవలందుఁ దారాడుచుఁ
బాడుమనస! విఱిగి పడెద వెపుడొ! ౧౩౬

(పవరసేణుఁడు ౩—౨)

ఆ. అద్దమందు నీడ యంటునట్లెవ్వని
యాత్మ నారుల వగఫు లంటుకొనవొ,
యట్టివానితోడ నెట్టు సెప్పుదు నత్త?
మనసు వ్రక్కలయిన మానెఁగాని! ౧౩౭

(రాయవగ్గఁడు. ౩-౪)

ఆ. పథికగృహిణి వంగి వైచునప్పుడు జాఱి
పడిన చేతికడెము నడుమ నిలిచి
యున్న యన్నపిండములు పన్నినడంచుఁ
గాకి యదిగో చూడు! తాఁకవెఱచు. ౧౩౮

(భోజయుఁడు. ౩-౫)

క. గడువు సమీపించినఁ జని
చెడునోయని వెఱచి మిగులఁ జెలికత్తియ లి
ప్పుడు గోడమీఁది గీఁతలు *
తుడిచెద రొకరెండుమూఁడు దొంగతికమునన్.

(వృణ్ణభోజయుఁడు. ౩-౬)

* ప్రియుఁడూరు విడిచి యిన్నిదినములైనవని గుర్తుకొఱకు గోడమీఁద వ్రాసికొన్న గీఁతలు.

ఆ. నీదు మోముతోడ నిండుపున్నమనాఁటి
చందురుండు పోలఁ జాలఁడనుచు,
వేలు తెఱఁగు గూర్పఁగోరి పోలె, విధాత
వాని ద్రుంచుచున్నవాఁడు; చెలియ! ౧౪౦

(రాహాహత్ఢి. ౩—౮)

తే. తళుకు వెడవెడ చూపులఁ బొలుచుచుండు
కలికి నెమ్మోము మఱునాఁడు గాంచినపుడు
గలుగునంతటి సౌఖ్యంబు గాదు మదికిఁ
దలఁపఁ దొలునాఁటి వలపులచెలిమిఁగూడ.

(భాణుసత్తి. ౩—౯)

క. ఎదురుపడి, ముందునకుఁ జని,
పదపడి వెనుదిరిగి, ప్రియుఁడు పఱపిన మోహా
న్మదదృష్టులె మాపాలికి
మదనశరము; లెవ్వరెట్లు మదిని దలఁచినన్. *

(వాహావరాయుఁడు. ౩—౧౦)

* 'మన్మథ బాణములనఁగా నెట్టివి?' అని యెవతెయో ముగుద ప్రశ్నింపఁగా నొక ప్రౌఢ యిచ్చిన ప్రత్యుత్తరము యిది. చూ. వ్యా.

ఆ. చందురుండు మోముసాటియౌ; నందలి
మోవితీయ యమృతమునకు సాటి;
కురులువట్టి తమిని గొసరికై కొనియెడు
సకియముద్దు కేమిసాటి? చెప్పుమ. ౧౪౩

(వాహవరాయఁడు. 3- ౧౩)

ఆ. కోరినట్టికోర్కి కూడివచ్చినవేళ
గుణము దోషమెంచుకొనుచు నందు
ఊఱక తడవు చూచుచుండెడు మనుజుండు
కడకుఁ జెఱుచుకొనును గార్యమెల్ల. ౧౪౪

(మాణయిందుఁడు. 3—౧౪)

క. తీపుసుమీ నీకన్నను
నాప్రాణమె నాకు; నిను వినా నిలువంగా
నోపదది; కాన బాలక!
కోపము వలదంచు వేఁడికొనియెద నిన్నున్!

(హాలుఁడు. 3—౧౫)

ఆ. ఎట్టిచోటఁగాని యెట్టివేళను గాని
కీడు గలిగినపుడు, గోడమీఁది
బొమ్మవోలె, పెడమొగమ్ము పెట్టని వాని
చెలిమి చేయవలయుఁ జేసికొన్న. ౧౪౬

(పాలితుఁడు. 3—౧౬)

ఆ. నాతి మొదటిపూఁట నదిచెంతఁ బొదరింట
నడత చెడుటఁజూచి, కడుఁగలంగి
పోలెఁ, బులుగు లెగిరి పోవుచో నవిగో! హా!
హా! యటంచు ఱెక్కలార్చి యఱచు!   ౧౪౭

(అర్ధరాయఁడు 3—౧౮)

ఆ. చిన్నవాఁడ! నిజము చెప్పెద వినుము; వ
సంతమాసమున కసాధ్యమేది?
మూఁరుకోనియు నెఱ్ఱగోరంట లింతైన
దారి తప్పలేదు దాని నడత!   ౧౪౮

(దేవరాయఁడు 3-౧౯)

ఆ. సకియ యింటితడిక సందులలో నెల్ల
బెళుకుఁగనులు వరుసఁబెట్టి కనుచు,
నీవు త్రోవఁబట్టి పోవఁ, బంజరమందు
పక్షివోలెఁ, గానవచ్చె నప్పుడు.   ౧౪౯

(అరికేసరి. 3—౨౦)

ఆ. ఇంటి తడికమీఁద నెద మోపి, వివశమౌ
తనువు బాటన వ్రేళ్ళకొనల నిలిపి,
వనిత యెంతచూచినను నీవు గాన రా
వేని యేమిచేయు నింకఁ జెప్పుము?   ౧౫౦

(బంహాయారి. 3—౨౧)

ఆ. దయితుఁ దలఁచి వెల్లియయి పొంగి పొరలెడు
బాష్పధార జాఱిపడునో యనుచు
నెఱచి గొంతు మలఁచి తెరువరి యిల్లాలు
దివ్వె దెచ్చియిచ్చు తెఱఁగు గంటె! ౧౭౧

(ఒంహాయూరి. ౩—౨౨)

క. తులువలు వలవదు; సాదులు
వలవదు; మాకెప్పుడు నడిమివారలె మే; లా
తులువలను జూచినను, సా
దులఁ జూడకయున్న, నొక్క దుఃఖమెకలుగున్

(హాలుఁడు. ౩—౨౮)

తే. కలికి! సాజంబుగా నిండుఁగనుల వానిఁ
జూచెదవుగాని క్రీఁగంటఁ జూడకమ్మ!
అతనిఁ జక్కఁగఁ జూచిన యట్టులగును;
నీవునొక ముగ్ధవనుచు మన్నింత్రు జనులు. ౧౭౩

(మయరందుఁడు. ౩—౨౭)

తే. అలుకతోఁ బగలంతయుఁ బలుక కింటి
పనుల ముగియించి నాతప్పావలని శోక
మెంతయున్నను నాకాళ్ళ చెంత రేయి
చెలియ శయనించు తెఱఁగును దలఁతునిప్పుడు.

(విచ్ఛముఁడు ౩—౨౬)

ఆ. సొగసుకాఁడ! నీదుమగువ సుశీలయై
మేము చెడిపెలగుట కేమి హేతు
వనెదవో! వచింతునా మఱి? నీవంటి
పరువమైన మగఁడు దొరకఁడొందు. ౧౫౫

(అణులచ్చి. ౩—౨౮)

ఆ. ఆతఁడూరు గాలునపుడు నాచేఁజేత
మగువ! నీటికడవ మార్చుకొనఁగ,
ఇంటిలోని యాస్తియెల్లఁ గాలినఁగాని
మదికి సంతసంబె యొదవెఁ గదవె! ౧౫౬

(భేచ్ఛలుఁడు. ౩—౨౯)

తే. ఆకులును గొమ్మలును లేక యడవి నడుమఁ
బొట్టిమోఁడుగ నెందైనఁ బుట్టవచ్చుఁ;
గాని, నరలోకమునఁ జేతఁ గాసులేక,
రసికుఁడై, దాతయై, పుట్టరాదు చూవె! ౧౫౭

(అసమసాహసుఁడు. ౩—౩౦)

క. చనిరా చెలికత్తియ; లా
యనువగు పొదరింఢ్లు ప్రోడులై మిగిలెను; మా
కును గడచె వయసు; వేఱులు
తునిఁగి తెగియెఁ బ్రేమ; దానితోనే మింకేఁ?

(నిరువముఁడు. ౩—౩౨)

క. ఎడఁబాటున విషమై యే
ర్పడు; జెంగటనున్న నమృతరసమై సుఖముల్
కడుఁగూర్చు; బ్రహ్మ రెండుఁ
దొడఁగి సరిఁగఁగలిపి చేసెనో యీచెలియన్?

(హాలుఁడు. ౩-౩౫)

ఆ. ఒకరినొకరు చూడకుండిన వేఱూఁజి
నిలిచియుండు గట్టివలపులైన,
కొడుక! కాలమేగుకొలఁది, దోసిటిలోని
నీరువోలె, మెల్ల జాఱిపోవు. ౧౬౦

(వహూరసుఁడు. ౩-౩౬)

ఆ. 'అమ్మ తేలుగుట్టె'నని చేతులను వీచు
చిన్నదానిఁబట్టి చెలులు జాణ
లదిగో! మగనికనుల యెదుటనే కొంచుఁ బో
యెదరు జారవైద్యు నిల్లు సేర! ౧౬౧

(మల్లసేణుఁడు. ౩-౩౮)

ఆ. దొరకకుండ నేఁడు దొరకిన చెంగావి
చీరగట్టి కాఁపువారి కోడ
లదిగో! చిన్నదయ్యు నడఁగక తిరిగెడు
విరివియైన యూరి వీధులందు! ౧౬౨

(మవుహుఁడు. ౩-౪౧)

క. దొరకు స్వతంత్ర్యము, ప్రియ సుం
దరి కలుక, సమర్థపురుషునకు శాంతగుణం,
బెఱిఁగిన వానికిఁ బలుకుట,
యెఱుఁగని మొఱకునకు మౌనమే, శోభించున్

(సుందరుఁడు. 3—౪౩)

తే. వడఁకి చెమరించు వ్రేళ్ళకు వసముగాక
నిలిచినడవక జాఱు సీకలము తోడ
స్వస్తి శబ్దమె ముగియింపఁ జాలనైతి!
కమ్మనిం కేమి వ్రాయంగఁగలను! చెలియ! ౧౬౪

(అంధుఁడు. 3—౪౪)

ఆ. ఐనదియును నష్టమె పోవు నరులకు
దైవకరుణ కొంత తప్పెనేని;
ఏమిపనికిఁ దొడఁగిరేనియు మూలమే
కూడి కుదుర దిసుకగోడ వోలె. ౧౬౫

(అంధుఁడు. 3—౪౫)

ఆ. అత్త! నేను దానమాడుచునుండ నా
నీటుకాఁడు వచ్చి యేటిదిగువ,
పసపుచేదు నీరు పట్టి త్రావుచును నా
యుల్లమెల్లఁ గొల్లె నొక్కమాఱు. ౧౬౬

(వోలపవుఁడు? 3—౪౬)

ఆ. చనిన యౌవనంబు వెనుకకు రాదు; జీ
వంబు చూడ శాశ్వతంబె కాదు;
ఒక్కనాఁడువోలె నొక్కనాఁడుండదు;
జనులకింత కటికతనము లేల? ౧౬౭

(హాలుఁడు. 3- ౪౭)

ఆ. పుడమిఁ జెడ్డవారు గడియించు నాస్తికిఁ
బాత్రులెవ్వ రట్టివారె కాక?
వేఁపమ్రానఁ బండ్లు వెలసినఁ గాకులే
వచ్చి వానిఁదినఁగ వలయుఁ గాదె? ౧౬౮

(పాలితుఁడు. 3- ౪౮)

ఆ. ఇలను సుజనులొరుల కలుగనే యలుగరు;
అలిగిరేని చెడుగు దలఁప రాత్మ;
తలఁచిరేని వెలికిఁ బలుకఁబో; రొకవేళఁ
బలికిరేని సిగ్గుపడుదు రెపుడు. ౧౬౯

(అర్జునుఁడు. 3- ౫౦)

తే. వలసినప్పుడు చేతిలోఁగలదె ధనము;
వ్యసనములఁ జెంత విడువనివాఁడె సఖుఁడు;
అమలగుణములు లోఁగొన్నయదియ రూపు;
వినతధర్మంబు వీడనియదియె తెలివి. ౧౭౦

(హాలుఁడు. 3- ౫౧)

క. కనుపాపల నరమూయుచుఁ
గొనగన్నులఁ జూచుచుండు కోడలి తెఱఁగుఁ
గని, యజమానుఁడు వలద
న్నను, తెరువరి మందిరాంగణముననె విడిసెన్.

(సుందరయుఁడు. 3–౧౪)

క. పెనుగొండను బోలిన మను
జునినైనను రెండుపనులు చుల్కఁబఱుచుఁ; జే
యనిపని చెప్పుకొనుట, చే
సిన కార్యము నొరులతోడఁ జెప్పుకొనుటయున్.

(గోవిందసామి. 3–౧౧)

ఆ. తడిక సందులందు వెడలు నాకులతోడఁ
దరుణతతికి నాముదంపుఁ జెట్టు,
'ఇచటఁగాపుకోడ లింతింతలేసి పా
లిండ్లదున్న'దని వచించుఁ బోలె. ౧౭౩

(ఉద్ధవుఁడు. 3–౧౭)

ఆ. ఎండు మఱ్ఱిమాని యండకుఁజేరి చ
ప్పట్లు చఱచి నగిరి పాంథులప్పుడు,
తమ్ముఁజూచి బెదరి దానియాకుల పండ్ల
పగిదినున్న చిలుక లెగిరిపోవ. ౧౭౪

(అణులచ్ఛి. 3–౬౩)

క. తెలివియు గుణములుఁగల ని
ర్మల చరితులతోడి పగయు మంచిది; జన నిం
దలపాలగు నల్పులతోఁ
జెలిమి పొసంగినను మీకు సిగ్గుపొడమెడుఁగా.

(నవరస త్రి? 3-౬౭)

ఆ. తరుణి! నీమొగంబు దాకెడు సూర్యుని
జెఱఁగుపెట్టి యడ్డుసేయవలదు;
తామరయును నీదు మోమును దాఁకి యిం
దేది సుఖము వాని నెఱుఁగ నిమ్ము! ౧౨౬

(నీలుఁడు. 3-౬౯)

ఆ. ఏమి చెప్పనేర్తు నింతి చెల్వును? చూపు
దాని మేన నెందుఁదగులుకొన్న
వెడలిరాదు మరల, నడవఁజాలని పేద
గోవు బురదఁ జిక్కుకొన్నయట్లు! ౧౨౭

(పవ్వయ కుమారుఁడు. 3-౭౧)

ఆ. నీటిమీఁదివ్రాఁత నిజము దుర్జనమైత్రి,
చేయుచుండఁగనె నశించుచుండు,
అదియె సజ్జనాళియందుఁ జల్పితిమేని
ఱాఁతఁగీచినట్టి గీఁత గాదె? ౧౨౮

(నరలుఁడు. 3-౭౨)

ఆ. మరల నింతలోన మరలిపోవంగ నీకు
నెలుసుపుట్టె మనసు? కటికవాఁడ!
తెరలు తెరలుగాఁగఁ దిరిగినవివె చూడు
కురులు, నేఁడుగూడఁ గుదురుకొనవు! ౧౯

(నలుఁడు. ౩-౨౩)

ఆ. మేము వేఁడుకొనిన మీఁద నల్కయొకింత
చల్లఁబడియెఁగాని, చాలసేపు
నీదు తప్పులను గణించుచు నిగుడేల
వ్రేళ్ళు సాలకుండ వెలఁది యోడ్పు. ౨౦

(విఘ్నుఁడు. ౩-౨౨)

ఆ. పండుమాట యుండనిండని దైవంబు
చేఁత; దానికేమి చేయఁగలము?
ఇంత చెప్పనేల; మొందునకొకంపుఁ
జవురువంటి చివురు భువిని లేదు. ౨౧

(శ్రీవయోవుఁడు. ౩-౨౯)

క. అనవరత బాష్పధారలు
కనుఁగడవలఁ బొంగుచుండఁగా నదిగో మా
నిని, చెక్కులందొఁచిన చం
దురునిమచ్చను గడుగుటలఁ దోఁచెనుఁ గంటే!

(విసమరాయుఁడు. ౩-౮౦)

ఆ. వేఱుపూలసరులు వేయింటిలో విర
జాజియున్న దాని సౌరభంబు
పోదు సుమ్ము;పాడుపూవిది; దీని నె
త్తావి గుబులుకొను విధంబె వేఱు! ౧౮౩

(వియహాలుఁడు. 3-౮౧)

ఆ. మానవంతుఁడైన వాని మనం బంత్య
దశలఁగూడ నున్నతంబె యగును;
మునిఁగి పోవు వేళలను సూర్యకిరణముల్
మీఁది పైకెఁగాదె మెఱయుచుండు! ౧౮౪

(మాపురాయఁడు. 3-౮౪)

ఆ. తెలిసి చని తమంతఁదిని ద్రాఁగవలసిన
వడవిగడ్డి మఱియు నడవినీరు;
అట్టులయ్యు వలపు లామరణాంతము
లేళ్ళ కిట్టులకుఁ జలింప వవుర! ౧౮౫

(అవణాయరుఁడు. 3—౮౭)

ఆ. చదురు నడతలేక సత్యంబు నెఱిఁగిన
వారి లోఁగొనంగ వసముగాదు;
కడుగునీరు ముందుగడఁ బెట్టి పాలంచుఁ
బాఁతపిల్లి బేలుపఱుపఁగలవె? ౧౮౬

(భోజయుఁడు. 3—౮౬)

తే. చెవులకమ్మల నీలాల జిగులు దగిలి
దయిత నునుఁజెక్కుఁలఁ దోఁచు ధవళచంద్రి
కరములఁ బ్రియుండు కాటుక బెరసినట్టి
బాష్పములటంచు వ్రేళ్ళతోఁ బాయఁదుడిచె!

[కలసగంధుఁడు. ౪—౨]

ఆ. చక్కఁదనము గలుగు చానలు జగములో
నెందఱున్ననేమి? యింత వినుము;
ఒడలి చెలువునందు నెడమ సగంబుతోఁ
గుడిసగంబె సాటిగూడుఁ జెలికి. ౧౯౨

[సిరిరాయఁడు. ౪—౩]

తే. నిలుపఁగారాని వలపు బందెమునఁ దగిలి
యతఁడు వాయించినట్లెల్ల నాఁడుచుండు;
మాఁగిన సాజంపుమ్రోఁడై నఁగాని, తీవ
చొక్కపెనఁగదె యద్దానిచుట్టుఁ జెలియ! ౧౯౩

[నసిప్పహా. ౪-౪]

క. దొరకుట కష్టము దయితుఁడు;
దొరకియు వసమగుట మఱియుదుర్లభ; మింకన్
దొరకినను దొరకనట్లే
తరుణీ! మన యిచ్ఛకొలఁదిఁ దా రాఁడేనిన్.

(౪—౫)

క. అనునయ సుఖమువలచి, చే
యనిపనియును జేసినట్టులాడి, యకట! కా
మిని, సరళ హృదయుఁడై నను
తనదయితుని దానె తప్పుదారికి నీడ్చెన్. ౧౯౫

(సీహాళుఁడు. ౪-౬.)

ఆ. కడచె నిన్నినాళ్ళుఁ గాలు సేతుల వ్రేళ్ళ
నొక్కటొక్కటి గాఁగ లెక్కపెట్టి;
'ఇంకమీఁద దినము లేమిట లెక్కింతు?'
ననుచు నేడ్చుచున్నదకట! ముగుద. ౧౯౬.

(పాలితుఁడు. ౪-౭)

ఆ. చిలుకముక్కువన్నెచే నొప్పు మోదుగు
పూలపఱపు పోలిచె నేలనెల్ల,
బుద్ధదేవు చరణములు మ్రొక్కఁ బుడమిఁ బై
వాలియుండు భిక్షుజాలమట్లు. ౧౯౭

(సూరణుఁడు. ౪-౮)

ఆ. పడఁతి! నీదుమేన బటువులౌ సంగంబు
లెల్ల నిల్లు సన్నగిల్లె; సన్న
మైన వెల్లఁబోచలై తోఁచె; నింక నీ
పాదుకోపమిట్లు పట్టనేల? ౧౯౮

(కులవృత్తుఁడు. ౪-౯)

ఆ. తమకు వాడుకైనదాని మెత్తురు గాని
గుణము సూచి మెచ్చుకొనరు జనులు;
ముత్తియములు వదలి మోజుతో గురిగింద
లేరుకొనరె చెంచువారలడవి? ౧౯౯

(సమరిణాసుఁడు. ౪-౧౦)

క. వడఁకుచును గందవాడి తన
పిడికిటఁగొని ప్రియునిమీఁద వెదఁజల్లఁగఁ బో
యెడు ముగుదకుఁ జెమ్మట న
ప్పుడె కలపంబయ్యె హస్తమున నదియెల్లన్.

(కాంతశరుఁడు? ౪-౧౨)

తే. మగువ! పెరటింటి యూడుగుమ్రాని యాకు
పిప్పనకు నంటుకొనియె; దులిపికొనవమ్మ!
బాణాలగు తోడికోడండ్రు సైచియుండ
లేఱక, నీవేమి పాపము నెఱుఁగకున్న. ౨౦౧

(పంషి. ౪-౧౩)

తే. రెండుచేతులఁ గన్నులు రెండు వానిఁ
గాంచినప్పుడు మూసికోఁగలను గాని;
చెలియ! మేనెల్ల గడిమి పూచిన విధాన
నప్పతిల్లెడు పులకలఁ గప్పుటెట్లు? ౨౦౨

(నస్సీహాుఁడు. ౪-౧౪)

తే. పూరిక ప్రొద్దుగాలికిఁ బోవ నింక
నేల గతిలేక యేడ్చుచుఁ గూలఁబడిన
వలసపోయిన యాతని చెలిని, మామ!
మెఱపులనె చూపెడిని బోలె మేనుములకు.

(రాయప్రోలు. ౪—౧౫)

ఆ. ఏదిదారికె నది భుజింపుము; లవణంబు
పల్లెటూర నెట్లునచ్చు మామ;
చెలువు కాఁడ; వినుము; స్నేహంబు లేనిది
లవణమెంతయున్న లాభమేమి? * ౨౦౮

(తిలోయగాఁడు. ౪-౧౬)

తే. సుఖము నడుగుచు నాయింటి ముఖసరోజ
సురభి నిశ్శ్వాసములఁ జల్లఁబట్టిచి యూయఁ
దాఁగె నొకమాట యాకాఁపురోగి, మామ!
వెగటుమందును జూక్కయు మిగులసీక. ౨౦౯

(తిలోయగాఁడు. ౪-౧౭)

* లవణము=ఉప్పు; లావణ్యము. స్నేహంబు=నేయి; వలపు.

ఆ. ఎంత యలుకగొన్న నేమి? సత్పురుషుల
నోటనెట్లు చెడ్డమాట వెడలు?
రాహువదన గహ్వరమున నున్నను జంద్రు
కరము లమృతరసమె కురియుఁగాదె; ౨౦౬

(అవంతివమ్మ. ౪-౧౯)

క. ఇతరులు దనుమన్నించినఁ
బ్రతిసేయఁగలేక దుఃఖపడినట్టులు, దు
ర్మతి నవమానము సేసిన
వెతనొందఁడు సజ్జనుండు, పేదఱికమునన్. ౨౦౭

(అవంతివమ్మ. ౪-౨౦)

ఆ. కలహములను గూడ వెలికిరా, వాత్మలో
సమసి పోవు, సాధు జనులు విన్న
మఱుఁగుమాట; లోక్కమాఱుగ నాయువు
గడచినప్పుడగ్గిఁ గాలుఁగాని. ౨౦౮

(హాలుఁడు. ౪-౨౧)

తే. పూలగుత్తులతో జాజిపొదలు పెఱిగి
యంగణమునందు వాకిండ్ల కడ్డమయ్యె;
దారిఁజూచుచు నుండు నోదార్పుగూడ
నూరఁ బతిలేని యతివల కుండనట్లు! ౨౦౯

(వత్సుఁడు. ౪-౨౨)

ఆ. అతివ ప్రియుని జూచినప్పుడు సుఖమున
మునిఁగి కన్నుదోయి మూయదేని,
దాని చెవులమీఁదఁదవిలి వ్రేలెడు నల్ల
కలువపూవు లెవఁడు గాంచఁగోరు? ౨౧౦

(వసంతసేనుఁడు. ౪—౨౩)

ఆ. అడుసునందుఁ జిక్కువడిన నాగలి యీడ్చి
మగఁడు సొలసి నిద్రఁదగిలి యుండఁ,
జిత్తమందు వలపు రిత్తవోవఁగ వాన
కాలమును శపించుఁ గాఁపుఁ బడఁతి! ౨౧౧

(చుల్లోహుఁడు. ౪-౨౪)

ఆ. పూలమయములయ్యెఁ జాలగట్టివి; మేను
దాఁకకున్న నుడుకు తాళరాని;
వాడలు చీల్చుచున్నఁగడుఁ దీపుగల వౌర!
మరునియమ్ము లొక్క తెఱఁగు గావు! ౨౧౨

(హాలుఁడు. ౪-౨౬)

క. వలపుల రేఁచు; వియోగ
మ్ములఁ జావఁగ సీయు; వీసుఁబుట్టించును; త
ప్పుల నెల్లను మఱపించును;
పలుత్రోవలు సుమ్ము చెలియ! వానిగుణంబుల్.

(మాహావసేనుఁడు. ౪—౨౭)

ఆ. కటికవాఁడ! నిన్నుఁగనఁగోర, చెంగావి
వలువమునుఁగువైచి, వాయసములఁ
బళ్ళెరములనించి పాప మిల్లిల్లును
దిరుగ వెడలిపోయెఁ దరుణి యిప్పుడు. ౨౧౪

(ధనంజయుఁడు. ౪—౨౮)

తే. పొగదగిలి మాసి పిడుకనిప్పుకలకంపు
చెంది పోగులు సడలిన చిరుగు గుడ్డ
గప్పుకొనియుండ నీచలికాలమందు
పేదవాఁడని తెలియంగరాదె వాని? ౨౧౫

(అణ్ణాయుఁడు. ౪—౨౯)

తే. నేర్పుకాఁడవు; సూర్యుని నెపమువెట్టి
యెవ్వరికి మ్రొక్కెదవు వచియింపు కొడుక?
చిఱుతనగవులు క్రేఁగంటి కఱకుఁజూపు
లెక్కడను రావు వేల్పుల మ్రొక్కునప్పుడు.

(విగ్రహారాయుఁడు. ౪—౩౨)

క. బుగులుకొను శోకభరమున
బిగిసినకంఠమున సగము వెడలుచుఁ బలుకుల్
తెగిపడఁగఁ బాట నెపమున
మగువా! యేడ్చెదవు తెల్పుమా యెవ్వనికై?

(అహాయుఁడు. ౪—౩౪)

ఆ. కనులు కానరాని కటికచీకటి రేయి;
వలసపోయె మగఁడు; వట్టియిల్లు;
దొంగలెవ్వరైన దోతురుసుమ్ము; ని
ద్రింపవలదు ప్రక్కయింటి వాఁడ! ౨౧౮

(అహాయుఁడు ౪—౩౫)

ఆ. క్రొత్తమొగిలు చూచి కోడలిప్రాణముల్
కదలుచుండ దానిఁగాచుచున్న
దితరచింత విడిచి, సుతుపాలి సంజీవ
నౌషధమ్ముపోలె, నత్తగారు. ౨౧౯

(విహాలుఁడు. ౪—౩౭)

ఆ. నీవు కానరాక పోవుడు, బాష్పంబు
వెల్లి పొంగిపొరలు వెడఁదకనుల
నీళ్ళువదలె నతివ నిన్ను వెండియుఁజూచు
నన్ని సౌఖ్యములకు నంద కాఁడ! ౨౨౦

(మణోరహాుఁడు. ౪—౩౮)

ఆ. చనవుగల్గు తొంటి జనులందఱును జచ్చి
పోయియుండు జన్మభూమిఁబోలె,
నాఁటిరూప యౌవనములు పోయిన నిన్నుఁ
గాంచి యెట్టులోర్వఁగలను బిడ్డ? ౨౨౧

(పవరరాయఁడు. ౪—౪౦)

ఆ. జనులనడుమ వాఁడు సంతసంబున విచ్చు
కొనినకనులఁ దనదుకోర్కె తెలిపె;
అప్పుడు నిలువుఁజెమటలైన యంగంబుల
నింత గూడ దానికియ్యకొనియె. ౨౨౨

(జీలపవ్రుఁడు. ౪-౪౧)

ఆ. వానిమీఁద నీకు వలపులేదేనియు
చెప్పుమ! వానిపేరు చెప్పినంత
ముద్దుగుమ్మ! నీదు మోమింత కానేల?
పొద్దుపొడుపు తమ్మి పూవుఁబోలె. ౨౨౩

(సుశీలుఁడు. ౪-౪౩)

తే. అలుకమానినికి పెనుగాలి, యంగమెల్ల
సుఖమునించెడు నెఱదాత, సురతనాట
కంబునకుఁ బూర్వరంగము, కౌఁగిలింత
చల్లగా న త్తె జగతి వర్ధిల్ల వలయు! ౨౨౪

(౪-౪౪)

ఆ. చిన్నవాఁడ! నీవు కన్నులయెదుటనే
యుండ దినదినంబు నెండుచుండు
నిట్టియొడలుగల్గి, యెవరికి నడిగిన
నేమిచెప్పవలెనో యెఱుఁగ లేము! ౨౨౫

(మాణిక్యరాయఁడు. ౪-౪౭)

ఆ. చేరి మేమె నిన్ను చెడిపెలముందఱ
మొదలు పొగడిపొగడి తుదకు నీవు
చేతఁ జిక్కకుండఁ జేసికొంటిమిగాని
యెవరి నాడుకొనఁగ నేలయిందు? ౨౨౬

(సంకరసత్తి. ౪—౫౦)

ఆ. పువ్వులు గోసి తేరఁబోకు; దోసిటినీళ్ళ
దేవతలకుఁ దనివి తీఱుఁ గొడుక!
మదిని నిల్పు మొక్కమాట; గోదావరి
గట్టులెపుడు నడతఁ గత్తరించు! ౨౨౭

(ణందణుఁడు. ౪—౫౫)

ఆ. చొక్కకనులు మూయు సుదతిఁ జచ్చెనటంచు
విడిచి పాఱుకాపువెడఁగుఁ జూచి,
పత్తికొమ్మ నగముపగిలిన కాయల
మొగమువంచి చేల నగియెఁబోలె. ౨౨౮

(జగ్గందసారుఁడు. ౪—౬౦)

ఆ. పుణ్యవతులు వడఁకి పులకించి నిట్టూర్పు
లూర్చి నాట్యమాడుచుండఁగలరు;
మగనిఁజూచినపుడు మావంటివారికి
నోడలఁ దెలివిమైన నుండదమ్మ! ౨౨౯

(రోలపవుఁడు. ౪-౬౧)

ఆ. కానివారిసిరిని గాంచుట, వైద్యుండు
లేని తెవులు, విభవహీనులగుచు
బంధుమధ్యమందు బ్రదుకుట, వలె, నీ వి
యోగదుఃఖ మెట్టులోర్తుదీని? ౨౩౦

(వామయేవుఁడు. ౪-౬౩)

తే. ఇంటిపెద్దల యెదురఁ దానెంతమనసు
నడఁచుకొని యుండినను, నీవు వెడలినపుడు
కనులు మూయుటచే ఱెప్పకొనలనున్న
దానికన్నీరు తటుకున ధరణిఁబడియె. ౨౩౧

(వాహావుఁడు. ౪-౬౭)

తే. మందబుద్ధివి, పెద్దలముందు నాఁడు
ఱెప్పవేయక నీవంక రెడ్డికూఁతు
రించుకించుక మొగము మలంచిచూచు
చికిలి క్రీఁగంటి చూపులఁ జెప్పలేదె? ౨౩౨

(వహురాహుఁడు. ౪-౭౦)

ఆ. ఎవనితోడనించు కెడఁబాటుగల్గిన
దేహమెల్లఁ జిక్కి తెల్లఁబాఱు,
నిదుర నిలిచిపోవు, నిడుదలౌ నూర్పులు
నతనితోడ నేటియలుక చెలియ! ౨౩౩

(హాలుఁడు. ౪-౭౪)

తే. సొగసుకాఁడ! మనంబున సురిగి సురిగి
నీకొఱకు నింక నేమరణింపఁబోను;
నిన్నె తలఁచుచుఁ జచ్చి వెండియును నీకె
చిక్కి వెతలను గుడిచి శోషింప నేల? ౨౩౮

(౮—౭౯)

ఆ. ఇచ్చకొలఁదిఁ దప్పులెన్నియైనను జేయు;
మన్నియోర్వనేర్తు మందకాఁడ!
నీదు సద్గుణములు నిండిన మాచిత్త
మందు దోసములకు సందులేదు. ౨౩౯

(మాపురాయఁడు. ౮—౭౬)

తే. తెరువరికి రాత్రిపూట నిద్రించుకొఱకుఁ
గసరి తిట్టుచు నిచ్చిన గడ్డిమోపె
యేద్చుకొనుచును మరలఁ దానిడ్చి వేయు
చున్నదిల్లాలు కనుఁగొంటె! యుదయవేళ*

(అత్థుఁడు. ౮—౭౫)

---

* మొఁదలం ఉపచారము చేయలేక కోపము. తరువాత ని దువురకును చెలిమి కుదిరినది. ప్రాతఃకాలమున అతని ప్రయాణముచే విరహ దుఃఖము.

ఆ. చేటులందు వెతలఁజెందరు! భయముల
గుండె చెడరు; సిరులఁ గ్రొవ్వగొనరు;
ఎచ్చుదగ్గులందు నేకచిత్తముతోడ
నొప్పువారు సుమ్ము గొప్పవారు. ౨౩౭
(ప్రిణాలుఁడు. ౪-౫౦)

ఆ. తనదు చెలిని తలఁచికొని నేఁటి ప్రొద్దున
పాడుచుండె వాఁడెవండొ చెలియ!
చెఱకువిల్తు నంపకఱకులు దిన్న నా
మదిని బుండు గోటఁజిదుమునట్లు. ౨౩౮
(కేసవుఁడు. ౪-౫౧)

తే. ఎంత యాఁకలి గొనియున్న నిదిగొ చూడు!
దయితకరిణీముఖంబును దలఁచుచుండి
తినమనసురాని కుంజరమునకు వాఁడెఁ
దొండమునయందె తామరతూండ్లపిడుచ. ౨౩౯
(౪-౫౩)

ఆ, 'అలుక మాను చెలియ;' 'అలిగిన దెవ్వతె?'
'పడఁతి! నీవె;' 'ఒరులపైన నాకు
నేటియలుక?' 'ఒరులిఁకెవ్వరిచ్చుట?' 'నాథ!
యీవె;' 'ఎట్లు?;' 'నాయదృష్టమహిమ?'
(కువిందుఁడు. ౪-౫౪)

తే. తిన్నఁగా నాదుకోనుఁడు; భీతిల్లవలదు;
పాపమీమెను దయ్యముల్ పట్టుకొనవు!
ఉన్నదున్నట్లు మేఘంబులుఱుము, బెదరి
భ్రాంతి గొనియున్న పథికుని భార్యగాని. ౨౪౧

(దుర్ధరుఁడు. ౪—౮౬)

ఆ. 'ఎవరిఁదలఁచు చుంటివే?' యని యడిగిన
'నెవరుగలరు నాకు భువి?' నటంచు,
గోలుగోలుమనుచు గొంతెత్తియేడ్చి యా
యింతి మమ్ముఁగూడ నేడిపించె! ౨౪౨

(సురహివచ్చుఁడు. ౪—౮౯)

ఆ. చెడుగుదాన! కాళ్ళఁబడినాఁడు; నీపతి
నింకనైన లేవనెత్తవేల?
వలపులెంత గట్టివాఱిన వయ్యును
ఇదియె వినుము వానికెల్ల మేర. ౨౪౩

(హాలుఁడు. ౪—౯౦)

ఆ. పచ్చరాతి సూదిఁ గ్రుచ్చిన ముత్యంబు
పగిది, గరికతుదను దగులు నీటి
బొట్టుఁ ద్రాగుచుండెఁ బొడువుగ మెడసాఁచి
కంటె! నెమలి వానకాలమందు. ౨౪౪

(పాలిత్తుఁడు. ౪—౯౪)

ఆ. మొదలు చెక్కుటద్దములదాఁక సవరంజి
కమ్మలెప్పుడుఁ దాల్చు కలికిచెవులు
దాల్పవలసె నేఁడు తాటాకుచుట్టల
జోడు; కాలమహిమ చూచినావె? ౨౮౫

[౪-౯౮]

తే. మండుచుండెడు వేసవియెండవేళ
నరుగుచుండెడు తెరువరికైనఁగాని,
మదిని నెలకొన్న ప్రియురాలి వదనచంద్రు
పండువెన్నెలవెల్లి తాపంబునణఁచు. ౨౮౬

[మంగలకలసుఁడు. ౪-౯౯]

ఆ. మండెదేని మండు; మాఁడెదేనియు మాఁడు;
పగిలెదేని పగులు పాడుమనస!
వాఁడు తగినవాఁడు గాఁడని యొకమాఱు
నిర్ణయించినాను నేఁడు మొదలు. ౨౮౭

(హాలుఁడు. ౫-౧)

ఆ. వెడఁద మూతితుదను వెడలినవాఁడియా
కోఱపంటితోడి కొడుకుఁ జూచి,
తల్లిపంది తనకునోల్లకున్నను మేయు
నూరి ప్రక్కతోటనుండు యవలు!* ౨౮౮

(విగ్రహుఁడు. ౫-౨)

---

* ఎవరైన నదలింప వచ్చిరేని కొడుకు పౌరుషము ప్రకటింప నవకాశము లభించునను పొగరుతోడి యాశ తల్లిపందికి.

క. ఇలమీఁద నశోకమ! కా
వలసిన దే మింతకన్న భాగ్యము నీకుఁ!
లలనారత్నంబుల చే
తులతో నీచివురు పోలుతురు గద రసికుల్.

(కర్దిలుడు. ౫-౪)

క. కొడుకునకును దయితునకును
నడుమను గూర్చున్నవేళ నఖముఖముల రా
పిడిచే నిల్లాలికిఁ జ
న్గడవలలోఁ జేపునొక టొకటి పులకించుఁ!

(హాలుఁడు. ౫-౯)

ఆ. మరులుకొల్పు నింత చిఱుత ప్రాయమునందె;
జుత్తెఁడైన లేదు చూడు మరల!
పెరిగెనేని రెడ్డిబిడ్డ యనర్ధంబు
దెచ్చు నిజము వినప్పుదీగవోలె! ౨౫౧

(భోజయుఁడు. ౫-౧౦)

ఆ. బురదయెల్ల నెండి పోవఁ దాఁబేళ్ళను
మీలు వెట్టఁజిక్కి మిడియుచుండ,
నేఁడు గంటిమెప్పుడుఁ జూడని దీ తటా
కంబులోని నేల కాలమహిమ! ౨౫౨

(౫-౧౪)

ఆ. దొంగతగులములకు లొంగి చీఁకటియంచు
వలసినట్లు తిరుగవలదు బిడ్డ!
కానఁబడెదు తొంటికంటెను మిగులఁ జీ
కట్లయందు దీపకళికవోలె! ౨౫౩

(బహ్లాయంతుఁడు. ౫-౧౫)

క. అడిగిన బదులాడదు, క
న్నడు వారలమీఁద రేగిపడు, నూరకె యూ
చెడిపె గను, మేటిలోపలి
మడువు పొదలు చిచ్చుదగిలి మండుచునుండన్.

(రోలయోవ్వుఁడు. ౫-౧౬)

తే. నిజము మేమెల్లఁ జెడితిమి; నీదిమచ్చ
లేనికులము! పతివ్రత! లేచిపోవె!
కాని, మేమెవ్వరమును మంగలిని వలచు
దంటలముగా మొకానొక దానిఁబోలె! ౨౫౫

(పాలితుఁడు. ౫—౧౭)

క. నిద్దుర గందురు; చెప్పిన
సుద్దులు వినఁగలరు; పలుకుచోఁ దడఁబడ; రే
పొద్దు నినుఁజూచి మెఱుఁగని
ముద్దియలదిసుఖము, మదనమూర్తి! జగమునన్

(దేవయోవ్వుఁడు. ౫-౧౮)

క. కలలో దొరకెడు లిబ్బుల
వలెఁ, జూచినయట్లె మఱుఁగువడి పోయెడు నీ
వలపులకు లోఁగి, పలుతలఁ
పులతోఁ బిన్నమ్మ! మోసపోతిమి గదవే!

(గీ ౨౮)

ఆ. ప్రియులు గాఁగిలించు వేళలఁ జనులపై
రత్నహారములను రమణులూడ్తు;
రెంత సుగుణవంతులేనియు నవమాన
మొందరొక్కొ కాలమొదవినపుడు! ౧౯౮

(గీ-౨౯)

ఆ. వేఱు తెఱఁగు చూడవే లాఁతి చిచ్చుల
వలెను గాదు పాడువలపుఁ జిచ్చు!
నీరసంపుటెదల నాఱి పోవుచునుండు;
మండుచుండు సరసమానసముల! ౧౯౯

(గీ-౩౦)

తే. మన్ననల నట్లు పెరిగిన; దన్నినాళ్ళ
చెలిమిచే వేఱుబలిసి నిల్చినది; చూడు,
ప్రేమ వృక్షంబు; పడిపోవువేళ నింత
చప్పుడైనను లేదేమిచెప్ప నక్క! ౨౦౦

(హాలుఁడు. గీ-౩౧)

ఆ. తీపుమాటలాడఁ దెగి చేదులాడితి;
వతఁడు కాళ్ళఁబడిన నరయవైతి;
వలిగిపోవ నాఁపవైతివి! పొలయల్క
నెవరికొఱకుఁ బూనితింకఁ జెలియ! ౨౬౧

(గీ-౩౨)

ఆ. తుడుచు నొక్కమాఱు, కడుగు నింకొకమాఱు,
కొసరి యొక్కమాఱు గోటఁజిమ్ము;
ముగుద యెఱుఁగలేదు, మగఁడు చన్దోయిపై
నాఁటియున్న గోటికాటుఁగంటె! ౨౬౨

(గీ-33)

ఆ. యౌవనంబువలె నుదారపయోధర
లీలఁ బొలుచు వానకాలమరుగ,
మొదటి తెల్లుఁబూవు మొలచెను, భూదేవి
శిరమునందుఁ గురుల నరపువోలె. ౨౬౩

(గీ-౩౪)

క. ఉడుగని జలధారల నెడు
నిడుదాఘ్రులఁ గట్టి యూచ్చి నిక్కియు బలిమిఁ
బుడమిఁ బయికెత్తలేకా
క్రుంగతి నఱిమెడిని గంటిరే మొగిలు దివిఁ!

(గీ-౩౬)

ఆ. ప్రియుఁడు గడువుదినముఁ జేర్కొన్న వేళలో
నొప్పుకొంటి; వున్నదున్నయట్ల
పాడుమనస! కలఁగఁబాఱెద విప్రుడు; న
మ్మించి నన్నుఁజెఱుప నెంచినావు! ౨౬౫

(౫-౩౭)

ఆ. నిండు జవ్వనంపు నిగ్గులు దేఱు క
పోలమూలమందుఁ బొలఁతి కదిగొ!
చెవిని వ్రేలుచుండు పువుగుత్తి వంగి లా
వణ్యరసముఁ ద్రావుపగిదిఁ దోఁచు. ౨౬౬

(౫-౩౯)

ఆ. అంగములు చెమర్ప నయ్యుండఁ గానిఁ జే
ర్కొనుచు దూతివెంటఁ గొసరి కొసరి
చెప్పినదియె మరలఁ జెప్పుచుఁ గామిని
కడకు వానియింటికడకె వచ్చె! ౨౬౭

(౫-౪౦)

క. నను గొట్టునమ్మనని వా
నిని గొట్టెదవేని, మదన! నే మఱుజన్మం
బునఁగూడ నాదు జీవం
బును నీపాదములఁబెట్టి పూజింతుఁ జుమీ.

(౫-౪౧)

ఆ. సిగ్గులేనివాఁడ! చేసిన మేలును
మఱచువాఁడ! నీదుకోఱకు వాన
కాలమందు రాత్రివేళఁ ద్రొక్కిన యూరి
బురద నేఁటికైన మఱవలేను. ౨౬౯

(९—४९)

ఆ. ప్రియ నయములైన పల్కుల తెగవేఱు;
ఇచ్చకంపునుడుల యచ్చువేఱు;
మనసులెఱుఁగునట్టి! మఱి వానిభేదంబు;
ఆకారంబు లొక్కటైన నేమి? ౨౭౦

(९—९०)

ఆ. వట్టి పెదవులందుఁ బుట్టినవీమాట;
లిట్టివెన్నియైన నేమి ఫలము?
మనసునుండి వెడలు మాటల తీఱది
వేఱు; నిల్వకుండు వెడలిపోక! ౨౭౧

(९—९१)

ఆ. అతివ! తెలియకుండ నడిగెద; ప్రియులను
బాసినప్పు డావారికెల్లఁ
జెప్ప మున్నయట్లు చేతులగాజులు
జరిగి తమకుఁదామె పెద్దవగునొ? ౨౭౨

(९—९३)

తే. చుట్టుఁదిరుగును; వగగొని సురుగు; మరలు;
చక్కఁబయికెత్తుఁ దొండము సాఁచిచూచు;
బురద దిగఁబడియున్న కుంజరముఁగాంచి,
వలపు సంకెళ్ళచేఁ గట్టువడిన కరిణి. ౨౨౩

(౫-౫౪)

ఆ. నీదు చూపుదారి నిలిచెదు; తిరిగెదుఁ
బ్రక్కలందు; ముందు పరుగులిడెదుఁ
గులుకులాఁడి; చేతిమెలదీగతో నిమ్మ
గట్టిదెబ్బ యొకటి! కాఁపుకొడుక! ౨౨౪

(౫-౫౭)

ఆ. గొల్లదొడ్డినడుమఁ గొవ్విన తుంటరి
కోడె వాఁడికొమ్ముఁ గొనల మెల్లఁ
గనులు గోకికొనుచుఁ దనదు సౌభాగ్య సం
పదను జాటుచుండు మొదవుఁగంటె! ౨౨౫

(౫-౬౦)

ఆ. పాదములకు మ్రొక్క బలిమి ముద్దులుగొనఁ
గలుగు పెక్కుసౌఖ్యములను నెల్లఁ
గోలపిల్ల! చెఱుచుకొంటివిగదె వానిఁ
జూచినంత నలుకసుద్ది మఱచి! ౨౨౬

(౫-౬౫)

ఆ. లేడికనుల ముద్దులాఁడి! నేఁటికినింత
యలుక చాలు! మరలనలుగవచ్చు;
నిండు చందమామ నిగ్గులతోఁడి యీ
రేయి సొగసుచూడు మాయఁదోడఁగ. ౧౭౭

(హ—౬౬)

ఆ. దీనులైనవారి తేఁకువ దీర్చి ర
క్షింప నేర్పువార లిరువురిలను;
పార్వతీశుఁడైన పరమేశ్వరుఁడు, రాజ
వల్లభుండు శాలివాహనుండు. ౧౭౮

(హ—౬౭)

ఆ. ఊరికెల్లనున్న దొక్కటియే కదా
పాదిరిచెట్టు రెడ్డివారియింట;
అత్త! దానిపువ్వులు నెత్తిపై మరఁదిగా
రిన్ని ముడుచుకొనుట యేమిబాగు! * ౧౭౯

(హ—౬౯)

---

* రెడ్డివారియింట నితనికి పూవులిచ్చిపంపువా రెవరో యున్నారని వదినెకు సందేహము.

ఆ. పేదరాలు నిండు వేవిళ్ళకాలమం
'దేమివలయు'ననుచు నెంద ఱెన్ని
మాఱు లడుగుచున్న 'మంచి నీరే'యను
మగనిఁ గలఁతవెట్ట మనసురాక! ౨౮౦

(౫-౭౨)

తే. పోలఁతి! చెప్పెడువారి మాటలకె వలచి
డబ్బులాడెదు గాని, చూడవు నిజంబు
వాని; చూచినయెవ్వతెకైన నిట్టు
నిమ్మళంబుగ నంగముల్ నిలువఁగలవె? ౨౮౧

(౫-౭౮)

తే. నీకొఱకు వేచి, కన్నులు నిదురలేక
వాచియుండఁగ, సొగసులు వమ్ముగాఁగ,
చిన్నఁబోవుచు వగకాఁడ! చెలులతోడఁ
జెప్పుకొనుటకు నోర్వదా సిగ్గులాఁడి! ౨౮౨

(౫-౮౨)

ఆ. బ్రిదుకు బొంగరంబు వంటిది; విరహాగ్ని
సైఁపరాదు; మేను సన్నగిల్లె;
చెలియ! యింకనేమిగలదు? నీవెఱుఁగుదు
వానితోడఁ జెప్పవలయుమాట! ౨౮౩

(౫-౮౬)

క. పెఱతప్పుల కలిగిన నొక
తెఱఁగున నెట్టులైన నరులఁ దేర్పనగుఁ జెలీ;
సరిపడని తప్పుచే ని
త్తఱినగ్గిన వాని నేవిధంబునఁ దేర్తుఁ? ౨౭౪

(శ్రీ—౭౭)

ఆ. వచ్చి చూఁచుచుందు విచ్చకాలాడుదు;
విం తె మంచితనము లెమ్మికాఁడ!
ఎవరి మనసులోన నేముండునో యది
తెఱచిచూపి యెవరు తెలుపఁగలరు? ౨౭౫

(శ్రీ—౭౯)

ఆ. దయితుఁజేర విఘ్నమయి పాడువెన్నెల
నీరు గగనసరసి నిండిపోయె!
చెలియ! చంద్రికిరణముల గొట్టముల యూటలెంత వేచియున్న నెండిపోవు! ౨౭౬

(శ్రీ—౯౧)

ఆ. ఊరఁ గొడుకులేకయుండఁగఁ గోడలు
వచ్చి కాళ్ళమ్రొక్క వంగినపుడు
గాజులెల్ల జారఁగాఁ జూచి కడుఁగోప
కత్తెయయ్యె, నేడ్చె నత్తగారు. ౨౭౭

(శ్రీ—౯౩)

తే. మలయ మారుత సౌరభములకు నోర్వ
వనుచు నన్నిల్లు వెడలనీద త్తగారు;
పెరటి యూడుగు పూవుల పరిమళంబు
గొట్టుకొని చచ్చినను జచ్చినట్టుగాదొ! ౨౮౮

(౫-౯౭)

ఆ. వనిత మొగముచూచుచును వాఁడు, వాని మొ
గంబు నొడలుమఱచి కనుచు నదియు,
ధన్యులైతి మనుచుఁదలఁచెద, రాల్మగ
లొరులు పుడమిలేక యున్నయట్లు. ౨౮౯

(౫-౯౮)

ఆ. వీడుకొన్నవేళ వెలవెలనైన యి
ల్లాలి మొగము చూచినట్టులెల్ల
బందెగొళ్ళువడఁగఁ బయనంపుమాటయే
తలఁపనేరఁడయ్యొ దారికాఁడు. ౨౯౦

(౫-౧౦౦)

ఆ. సూది గ్రుచ్చుకొన్నచోట రోకటఁ గొట్టి
వారు పాడుజనులు; వీరికొఱకు
ఒక్కయూరనుండియును రెండుకన్నుల
నిండఁ బ్రియునిజూడ నేరనమ్మ! ౨౯౧

(౬-౧)

ఆ. నిన్ను వేడుకొందు; నేఁడొక్కపూట న
న్నేడ్పుచుండ నడ్డగింపవలదు!
ప్రియుఁడు రేపు మఱల వెడలినప్పుడు చెలి!
భూమినున్న నేడ్వఁబోను లెమ్మ! ౨౯–౨

(౬–౨)

ఆ. నిన్నుఁ జూచువేడ్క నీసద్దువిని యెన్ని
యడుగులింతి వేగ నరుగుదెంచె,
వెనుక కన్నియడుగులును మోయవలసెను,
నీవుచూపుదాఁటి పోవ, దాని. ౨౯ ౩

(౬–౫)

ఆ. బొమల ముడులు మత్సరమును నీసునులేక
యెండినట్టులుండు రెండుకనుల
నతఁడు నన్నుఁజూచు నందఱివలె; నింకఁ
జిక్కిపోక యేమిసేతు నత్త! ౨౯ ౪

(౬–౬)

ఆ. ఎప్పుడు మదికిఁ గూర్తు; వెగ్గలు చేయవు;
నిజముగాని, ప్రేమ నిండియుంట
నమ్మకంబు లేదు నాకు నీయెడ; ధైర్య
మాఁడువారికేది? యందకాఁడ! ౨౯ ౫

(౬–౭)

ఆ. ఇంకనొకటి వచ్చు నిప్పుడో యప్పుడో *
మంకుమనస! దుఃఖమాత్రమునకె
యేలయిట్లు మిడుక? నింతట ముగిసెనే
పరుల సొత్తుకాశపడిన నీకు! ౨౯౬

(౬-౯)

ఆ. సుగుణవంతురాలు, సుందరి, నిజమది;
నేను బనికిరానిదాన నిజము;
కాని యొక్కమాట; దానిబోలఁగలేని
వారలెల్లఁ జావవలయునేమి? ౨౯౭

(౬-౧౧)

ఆ. కలిమి లేమియును సుఖంబును దుఃఖంబు
దెలిసినడచి, యిల్లుదీర్పఁగల్గు
వారె సతులు; లాఁతివారలు భర్తల
కంటియుండు ముప్పులంతె, కొడుక! ౨౯౮

(౮-౧౩)

---

* మరణమని భావము.

తే. అలఁతి నగవులె చీవాట్లు; హద్దుమీఱి
సలుపు నుపచారములె మదిఁగలఁచు పనులు;
కంటఁబడి వెట్టుకొనుటయె కలహవిధము;
లరయ నిట్టిది మంచి యిల్లాండ్ర నడత. ౨౯౯

(౬ - ౧౩)

ఆ. జనవిరుద్ధమైన పనిగాన వానితో
మాటలాడకున్న మానెఁగాని;
యెదురు పడినవాని నెట్టిశత్రువునైన
నెవరు చూడకుండ నేఁగఁగలరు? ౩౦౦

(౬ - ౧౪)

ఆ. పేదవాఁడు గూడఁ బ్రియురాలు కైవసం
జేని ధనికునట్లు యెంచుఁ దన్ను;
ఉర్వియెల్లఁ జేతనున్నను బ్రియురాలు
లేనివాఁడు తలఁప లేనివాఁడె! ౩౦౧

(౭ - ౧౫)

క. ఆయూరి సొగసు, నామా
ప్రాయము, నావయసుమగల వైభవముఁ గథా
ప్రాయముగఁ జెప్పుకొంద్రు చె
లీ! యందఱు; మేము నాలకించెద మిచటన్!

(౬ - ౧౭)

తే. మోవి చెక్కిళ్ళు కన్నీట మునిఁగి యదరు
చుండ వెడనవ్వు నవ్వుచు నువిద పలికెః
'ఇఁకను నీవయిఁ గోపింపనేల? బాస
చేసి యొప్పించుగతికి వచ్చినది ప్రేమ!' 303

(౬–౧౮)

ఆ. వన్నె నేయి పూసికొన్న నా మోమును*
గూడఁదమిని ముద్దులాడుఁ దొలుత;
ఇప్పుడు చూడు! నన్ను నింతసింగారించు
కొన్నఁ దాఁకుటకును గొంకు వాఁడు! 304

(౬–౧౯)

ఆ. సిగ్గు విడిచి, నడత చెడఁగొట్టుకొని, లోక
మెల్ల నపయశంబు నెత్తిచాఁటి,
యెవనికొఱకుఁ జెలియ! యుల్లైతి, వాఁడె నా
పాలి కన్యుఁడైనవాఁడు నేఁడు! 305

(౬–౨౪)

* ఆ కాలమున రజస్వలలు గుర్తుగా మొగమున వన్నెగలిపిన నేయిపూసికొనుట దేశాచారమని వ్యాఖ్యాత.

మా. మొదటిశతకము ప. ౨౨

క. పలువరుసలు దోఁపని న
వ్వులు, ముంగిటికడప దాఁటిపోవని గమనం
బులు, నెమ్మగ మెత్తని చూ
డ్కులుఁ బద్ధతులివియసుమ్మ కులవధువులకున్.

(౬—౨౫)

ఆ. "ఇంత పొఁగరు కేమి హేతువు? నడచెద
వడుగుమీఁద నడుగులిడుచు; బంది!"
పెదవులందు నగవు బిగఁబట్టి యదిపల్కు:
"దొంగ! యింతలో నెఱుంగఁగలవు!"* ౩౦౨

(౬—౨౭)

తే. ఎందుఁజూచిన నందెల్ల నెదుట వ్రాసి
పెట్టినట్టుల నీవు కాన్పింతువెపుడు;
ఏమిచెప్పుదు! దిక్కులందెల్ల నంద
కాఁడ! నీ పటముల వ్రేలఁగట్టినారొ! ౩౦౩

(౬—౩౦)

* నాథుఁడు వచ్చి నన్ను రక్షించి నిన్ను శిక్షించునని భావము.

ఆ. తొలఁగి నిలుచుఁ; గొమ్మ దులుపును; కొఱకొఱ
మనుచు గోళ్ళబఱుకు; నదిగొ కోఁతి;
తొలుతఁ గుట్టినట్టి తుమ్మెదయనుచు నే
రేడుపండుఁ దాఁక నోడుఁ జూడు! ౩౦౯

(౬—౩౧)

ఆ. అకుపొదలనడుమ నల్లని వ్రేలాడు
దూలగొండియాకుఁబోలె నున్న
యాఁడకోఁతిచేతి నంటదు మగకోఁతి
దురద దగులుననుచు వెఱచి కంటె! ౩౧౦

(౬—౩౨)

ఆ. పరువులెత్తు జనము, మొరసెడు వాద్యము
లలబలంబుగలిగి, యకట చూడు!
వాఁడొకండు లేమి నేఁడదే పండుగ
కాలుచున్న యూరికరణిఁ దోఁచె. ౩౧౧

(౬—౩౪)

ఆ. పనులు ముగియకుండ మునుమున్నె తెరువరి
యింటి త్రోవఁబట్టి యేఁగఁ జూచి,
కొండమల్లి పువుల నిండునవ్వుల నవ్వెఁ
బోలెఁ గ్రొత్త వానకాలమత్త! ౩౧౨

(౬—౩౫)

ఆ. మీఁదికెక్కి వచ్చు మేఘంబులను జూచి,
బ్రిదుకుమీఁది యాశవదలుకొనుచు,
కనుల నీరు నిండఁగాఁ బాంథునిల్లాలు
చిన్నికొడుకు దెసకుఁ గన్నువఱపె. ౩౧౩

(౬–౩౮)

తే. మెండుకొని మిద్దెబంగలనుండి కురియు
వాననీళులఁ దోఁగిన ప్రాఁతయింట
నానకుండిన చోటును నాన్పుచున్న
దకట! కన్నీళ్ళఁ బాంథునిల్లాలు చూడు. ౩౧౪

(౬–౪౦)

ఆ. మలయ మారుతంబు పొలయదు; మామిడి
కొమ్మలందు మొగ్గ కూడుకొనదు;
కాని, కలఁతగొన్న మానసంబె వసంత
కాలమనుచుఁ దెలుపఁగలుగు నక్క! ౩౧౫

[౬–౪౨)

ఆ. కారణంబు లేక కడునాసతో నిట్లు
తేఁటిగుంపు మావితోఁటలందుఁ
మలయుఁజాలదెపుడు మగువరో! పొఁగతీగ
లగ్గిలేక యెట్లుఁలాడఁగలవు? ౩౧౬

(౬–౪౩)

క. దిక్కులు సూచుచుఁ బాడుచు
సొక్కిపడుచు నావులించుచును నిట్టూర్పుల్
గ్రుక్కుచు నేడ్చుచుఁ గుంటుచుఁ
బొక్కెదు! నీకేల దారిపోకలు పథికా? ౩౧౭

(౬—౪౬)

ఆ. అత్త పడినదింట మత్తెక్కి; పతి పోరు
ఊరికేగ; కుక్క దారిపోయె;
ప్రత్తిచేను విఱుగఁబడ మేసె నెనుబోతు;
దీని నతని కెవరు తెలుపువారు? ౩౧౮

(౬—౪౮)

తే. బైటఁగాని పోవె పడకింటి పంజరంబు
లోని గోర్వంక నెచ్చటికైన, నత్త!
పాడుపులుఁగిది; రేయి మేమాడుకొన్న
చనవుమాటలు చాటించు జనులకెల్ల. ౩౧౯

(౬—౫౨)

ఆ. నిడుద కురులు చూడు! నీళ్ళాడి లేచిన
తఱిని గోమలాంగి పిఱుఁదులంటి,
బంధనంబువలని భయముచే నేడ్చెడిఁ
బోలె, జాఱు నీటిబొట్లఁ జూడ. ౩౨౦

(౬—౫౫)

ఆ. చేట కాలిపోయె; సెనగలు వేఁగలే;
దత్తగారి కింట నలుకపుట్టె;
చూడకుండమునుపె వాఁడేగె; నన్నియు
చెవిటివెదుటఁ బట్టు సెంకులయ్యె! ౩_౨౧

(౬—౫౭)

తే. కన్నుఁగవ విచ్చిచూపులు గదలకుండఁ
బులకరించు చెక్కిళ్ళతో, జలకమాడు
వేళ, నీటమునింగిన ప్రియుల కౌఁగి
లింపుసుఖములఁగంటె! తెల్పెదరు సతులు.

(౬—౫౮)

తే. పగళులంతయుఁ గార్కొనఁ బఱచు వాన
కాలమందలి క్రొత్తమేఘంబు లుఱుమఁ
గడుముదంబున నెమిళులు మెడలుసాఁచి
యాడునాటలు కనుపండువయ్యెఁ గంటె! ౩_౨౩

(౬—౫౯)

ఆ. కొమ్ముతోడఁ జిమ్మికొట్టినఁ బిసపిస
మీఁదికెగిరి, గోటమీఁటినట్టి
వీణఁబోలె, గేదెవీఁపున దోమలు
మూఁతవెట్టుఁ గంటె గుంపుగట్టి! ౩_౨౪

(౬—౬౦)

తే. తుప్పుమని మీఁదికెగిరెఁ దొప్పనుండి
గండుఁ జిల్కలవే! శరత్కాలమందు,
జ్వరము దగిలిన మ్రాను నెత్తురును బిత్త
మొక్కమాఱుగఁ గ్రక్కుచు నున్నయట్లు.

(౬—౬౨)

తే. కడిమి పూఁదావి మూర్కొని కనులనీరు
గార్చికొనియెద వేల? యోదార్చికొనుము;
వయసువాఁడవు; పథిక! వెండియును నిల్లు
సేరి నీచెలి మోము దర్శింపవల దె? ౩౨౭

(౭—౭౫)

ఆ. ఇనుపగుండెవాఁడ నేను; నామీఁదనే
యుఱుముకొనుము సత్తువున్నయంత!
కాని, వ్రేలుకురుల దాని ననాథ నా
చెలిని జంపవలదు, జలధరంబ! ౩౨౮

(౭—౭౭)

తే. సాంధ్యరాగంబులోపలి చంద్రరేఖ
నెలమొదలివాఁడు కనులఁదవ్వేడిని గంటె,
వలిప చెంగావిపైఁటలోపలఁ జెలంగు
క్రొత్త మగనాలి గుబ్బ గోరొత్తువోల. ౩౨౯

(౬—౬౯)

ఆ. ఆకసంబువంక నక్షత్రల చూచెద
వోయి మఱఁది! నీకు నఁబుసుపోదు!
ఇంటఁ జూడరాదె యిల్లాలి యెదమీఁద
నర్ధచంద్రరేఖ లన్నియుఁడ! ౩౨౯

(౬-౨౦)

ఆ. వలపుటగ్గి పొగలవలె, లోకమును మరుల్
గొలుపు నెమలియీఁక కుంచెవోలె,
ప్రియమునకు సిడెము పగిది-నమ్ముగుద మో
చెడిని గంటె సురభి చికుర భరము. ౩౩౦

(౬-౨౧)

ఆ. చోరజనులు సారెసారెకుఁ జూతురు
భయముఁ గోరికయును బైకొనంగ,
వీరవరుని పత్ని వీఁగుఁ జన్నులఁ, బాము
గాచుకొన్న లిబ్బికడవలట్లు. ౩౩౧

(౬-౨౬)

ఆ. చూడు వింధ్యశిఖరి సొబగు! వర్షర్తుల
క్షీణపయోధరములు మేను సోఁక,
అన్నికడల మొలచుచున్న లేఁబచ్చిక
గుంపు పేరఁ బులకరింపఁ దొడఁగె. ౩౩౨

(౬-౨౨)

ఆ. పెనుమొయిళ్ళగుంపు పనిపూని, పట్టి, యొం
డొంటఁ బంతగించి, యుఱిమి, యదిమి,
మూసికొన్న, నేమిమోసమో యెఱుఁగము
గాని, యాకసంబు కాఱుఁదోడఁగ! 333

(౬—౧౦)

ఆ. మగువ! యిట్లు తిరుగమరగిన ప్రియుని సౌ
భాగ్యగరిమ యెంతవట్టు నిలుచు?
వలపుడప్పిఁ జిక్కు చెలులు క్రేఁగంటి చూ
డ్కులను దార్చి పట్టుకొనుచునుండ. 334

(౯—౧౧)

ఆ. ఇంటియాలు; కౌఁగిలించుకో; తొలుకోడి
గూయ బెదరి మేలుకొన్నవాఁడ!
ఇరుగు పొరుగువారి యిండ్లంచు నీయింటఁ
గూడ నిట్లు వెఱపుఁ గొనకు సుమ్ము. 335

(౬—౧౨)

ఆ. కడిఁదిగాడ్పు వచ్చి మెడఁబట్టి కొండపై
నుండి బలిమిఁద్రోయ నొడలు చిదిగి
చెడిన కాఱుమొగిలు జీవంబువలె, నూఁగు
లాడు గుబుకుగుబుకు మనుచు మెఱుపు. 336

(౬—౧౩)

క. పొగరెక్కి దేశదేశము
మగవారలు తిరుగు తప్పు మగువల దే; మె
ల్లఁగ నొకరిద్దఱి బ్రదుకులు
ముగియువఱకు నీవియోగములు తెగవు భువిన్.

(౬–౮౬)

ఆ. తామసంబు చేసెదవె! చావనున్న దా
పిచ్చి పిల్లయిపుడు! పిన్నవాఁడ!
నీమొగంబుఁ జూచెనేనియు బ్రదుకును;
సందియంబు వలదు; నరగఁబొమ్ము! ౩౩౮

(౬–౮౭)

ఆ. కాఱుచిచ్చు నాలుకల యెఱ్ఱవన్నియల్
గ్రమ్మియున్న కాననమ్ము విడిచి,
పోదు లేడిపిల్ల, పూచిన మోదుగు
మ్రాఁకులంచు నకట! మదిని దలఁచి. ౩౩౯

(౬–౮౮)

ఆ. గోరువంక పెద్దవారి ముందఱఁ బడ
కింటిలోని సుద్దులెల్ల నపుడు
చదువ మొదలుపెట్టుసరికి-మాయమ్మ! యెం
దేగి చొచ్చుటకును నెఱుగనైతి! ౩౪౦

(౬–౮౯)

ఆ. అత్తె! మొల్లతీవయందదియేమియో
కలదు గొప్పగుణము; తెలియలేము
గాని; తేఁటులెల్లఁ గన్నులతోడనే
దానిఁ ద్రాగివేయఁ దలఁచుచుండు! ౩౪౧

(౬—౯౧)

క. రూపన్న రెడ్డికూఁతురి
రూపే యగుఁగాని యొరులరూపును రూపే?
యూపల్లెవారు వేలుపు
లై పోయిరి దాని ఱెప్పలార్పక కనుచున్! ౩౪౨

(౬—౯౨)

ఆ. అంబురాశిఁ ద్రచ్చి యన్నికష్టములతో
నమృతరసము దేల్చి రమరులెల్ల;
తమకు మిగులఁ గూర్చు తరుణులకెమ్మోవి
రుచియె వారెఱుంగరో! తలంప. ౩౪౩

(౬—౯౩)

ఆ. చేతికోలఁది నీడిచినవాఁడియమ్ముచే
నాయమందు గాయమైన లేడి,
'ఇదియె కూర్చునిత్తు తుదిచూపు' టంచును
మొగము దిప్పి చాలప్రొద్దుసూచె. ౩౪౪

(౬—౯౪)

ఆ. ఎక్కరాని చోట నొక్క మామిడిపండు
వ్రేలుచుండఁ జూచి బిడ్డఁ డేడ్వ,
నీదు శత్రుగృహిణి నిలఁబడి వేఁడెను
దారివచ్చి పోవువారి నెల్ల! ౩౮౫

(౬—౯౫)

ఆ. పూవులమ్ముదాని భుజమూల సౌందర్య
దర్శనంబుచేతఁ దనివిసనక,
తరుణవిలుఁడు చుట్టు దిరుగుచునున్నాఁడు
చూడు! వట్టి బేరమాడుకొనుచు. ౩౮౬

(౬—౯౭)

ఆ. ఒకటి నొకటి ప్రోచుటకు వింటికెదురుగాఁ
జొచ్చుచుండు జింకజోడుచూచి,
మనసునొచ్చి, బాష్పమునఁదోఁగు పెనువిల్లు
వేటకాఁడు జారవిడిచె నపుడు. ౩౮౭

(౭—౧)

ఆ. అందకాఁడ! నిలువుమయ్య; నీకొక్కతె
సుద్ది చెప్పవలయు;—వద్దులెమ్మ
కాకయున్న—తనకుఁగాని పోకలఁబోవు
చంచలాత్మ యదియె చావనిమ్మ! ౩౮౮

(౭—౨)

ఆ. అష్టులేని తిరుగులాటలు నవ్వులా
టలకు నెల్ల మొదలు జలము విడిచి,
వెనుకఁ గోడలు చెడిముసుఁగు సంసారంపుఁ
బెద్దబరువు మీఁదఁబెట్టుకొనియె. ౩౮౯

(౭-౬)

తే. వానిచెంతకుఁ బోదువుగాని, యాత్రి
మేల చెలి? చందురుండు పైకెక్కనిమ్ము;
పాలలోఁ బాలుగలిసిన పగిది, నెవఁడు
నీమొగము గుర్తుపట్టు వెన్నెలల నడుమ? ౩౯౦

(౭-౭)

తే. గోధనంబులు విడిచిన గొల్లదొడ్డి
కరణి, ద్రవ్యంబులేని మందిరముపగిది,
వట్టిపోయిన సెలయేటి వాయిపోలె,
దాని మొగమయ్యె నీవు కడదాఁటి పోవ. ౩౯౧

(౭-౯)

ఆ. సిగ్గులాఁడి కేమిచెప్పెదు? నిను నాఁడు
గన్నయపుడు పుట్టియున్నవలపు,
మనసునందె యడఁగి మాసిపోయెనీని చై
కొనక, పేదవారి కోర్కెఁబోలె. ౩౯౨

(౭-౧౦)

ఆ. "పుడమి నెవతె చిక్కిపోవుచున్న నదెల్ల
నీదుకోసమనుచు నియమమేమి?
నగుచు నడిగెదిట్లు! నామేను వేసవి
నిల్లె" యనుచుఁబల్కి యేడ్చె నింతి! ౩౫౩

(౭—౧౧)

తే. నీమదికి నింపుగానివన్నియును జేత
నైనయందాఁకఁ జేయక మానఁగలను;
నేనె నీకింపుగాకుంటినేనిఁ జెప్పు
మదియు నాచేతనున్నదే? యందకాఁడ! ౩౫౪

(౭—౧౫)

ఆ. అవయవముల పనుల నన్నిటి నీ పాడు
సిగ్గు జరుగకుండఁ జేయుఁగాని;
చెవులువినక యడ్డుసేయఁజాలకపోయెఁ
జూడు! పెద్దలున్నచోటఁగూడ! ౩౫౫

(౭—౧౬)

ఆ. ఇట్టి యొంటిదిరుగ నేగుచో లేడి వే
ఠాసతోడఁ జూచినట్టిచూపె,
మగువమీఁద మిగుల మక్కువగల చెంచు
జేని చేతివిల్లు క్రిందజార్చె. ౩౫౬

(౭—౧౮)

ఆ. వింధ్యగిరికి వలసవెడలెడు మాట లీ
పల్లెలోన నెత్తవలదు; రెడ్డి
కూపిరాడుచున్న; దొకవేళ బ్రతికి యీ
పలుకువినినఁ బ్రాణములను వదలు! ౩౬౧

(౭-౩౧)

ఆ. బుద్ధిసెప్పె రెడ్డి పుత్రునిబట్టి, ప్రా
ణములు వదలువేళ, 'నాదు పేరు
సెప్పకొనుచు సిగ్గుచేటుగాఁ బల్లెలోఁ
బందబ్రదుకు బ్రదుకవలద'టంచు. ౩౬౨

(౭-౩౨)

ఆ. తేనెటీఁగ కాటుచే నాథు పెదవి వా
చినది చూచినంతఁ జెంచుగరిత,
ఈసుచేతఁ బల్కరించినఁ బలుకక
యొండు మాఱినిసీడ యండకరిగె. ౩౬౩

(౭-౩౪)

తే. జలజలన పాఱు సెలయేళ్ళ చప్పుడులను,
కడిగినట్లున్న బండలఁ, గడమిపువ్వుల
నిండుదావుల, నర్తించు నెమలి గములఁ
గొండపల్లెలు మనసు నాఁకొలుపు మిగుల.౩౬౪

(౭-౩౬)

ఆ. చేప్పునప్పుడు మొదలు చేయైనఁ దడిగాదు;
గోవు నేఁడుచూడు! గొల్లవాఁడు
మేపి బుజ్జగించు మెలపునఁ గడవల
కొలఁదిఁ బాలు పిదుకఁగలిగెనాఁ! ౩౬౫

(౨—౩౮)

ఆ. మూరుకొనును, దాఁకు, ముద్దాడు, నెదమీఁద
నిలిపికొనును, మేనఁబులకలెగయ,
తనకుఁగూర్పు మగువ నునుఁజెక్కిలినిబోలు
నిప్పపూవు, దారినేఁగువాఁడు. ౩౬౬

(౨—౩౯)

ఆ. కొండదరిని దగులుకొనియున్న పెనుఁబాము
పొరనుజూచి, యదిగొ, కఱకుటెండఁ
జేరి వనగజంబు సెలయేటి నీరంచుఁ
దలఁచి తలను రిత్త తడుపఁ బోయెఁగె! ౩౬౭

(౨—౪౦)

తే. వెలగపండ్ల సుగంధము వలచి పాఱె
పోయెదవు తేఁటి! తామరపూవు వదలి;
చిత్తరువులోని లక్ష్మినాశించు పాము
రునిపగిదిఁ, దాఁకినప్పుడెఱుంగఁ గలవు. ౩౬౮

(౨—౪౧)

క. ఆయెడనె పుట్టు నెప్పుడు,
నాయెడనే సాఁగు, సుద్దు లందేముగియుఁ;
ఓయత్త! యొక్కఁడేనా
ప్రియపుమగఁ డింతపెద్ద పల్లెకు నెల్లన్? ౩౧౯

(౨—౪౮)

క. ఏమాటలు మేమాడుదు
మామాటలె యూరివారు నాడుదు; రవియే
కోమలి! యాతఁడు పల్కిన
నేమో సౌఖ్యంబు మదికి నెచ్చుచునుండున్. ౩౨౦

(౨—౪౯)

ఆ. వలచినట్టి వారిచెలిమి సాధింపఁ డె
ట్లయిన సుఖమునందు నాసయేని;
ఎవరిమదికి నెది రుచించు వారికి దాన
లేదు సుఖముగాని దేది గాని. ౩౨౧

(౨—౫౦)

ఆ. చూచుచుంటి మేని చూపులఁ దన్పును;
తలఁచుకొన్నయపుడు తనుపు మనసు;
చేరి పలుకువేళఁ జెవులఁ దన్పును; నిత్య
రమ్యమూర్తిగాదె ప్రణయిజనము! ౩౨౨

(౨—౫౧)

తే. హృదయ ఫలకము మీఁద నేమేమి మనసు
ఆసయనియెడి కుంచెతో వ్రాసికొనునొ,
నవ్వుచును విధి దానినంతయును బట్టి
తుడిచివైచుచునుండు, బాలుఁడును బోలె. ౩౨౩

(౨—౫౬)

తే. వాని మాటెత్తఁ బులకలు వాఱుమేన;
కాలి సవ్వడి వినినంతఁ గరఁగె నలుక;
మొగము గన్నంత నడఁకెడు; ముగుద! వాఁడు
కౌఁగిలించిన నేమికాఁగలనో యింక! ౩౨౪

(౨—౫౯)

ఆ. వాలి బరువుచేత వంగిన లేఁగొమ్మ
కొనలఁ గాళ్ళు కుదురుకొనక జాఱ,
మాఁకులందు నిలుచు, మఱల ఱెక్కల సవ
లించికొనుచుఁ బులుగు లెక్కకేని. ౩౨౫

(౨—౬౦)

ఆ. తిండి నీరుఁబెట్టి దండిగఁ గుక్క నా
చెడిపె యెంత చనవుచేసికొన్న
దదిగో చూడు! యింటఁ దనదె నెమకెను;
నింటి మగఁడు వచ్చెనేని మొఱఁగు! ౩౨౬

(౨—౬౩)

ఆ. ఉన్నదున్నయట్లె యూరియందఱి ముందు
చెక్కి పెద్దవిల్లు చిన్నఁజేయు
కొడుకుఁగాంచి, మగఁడు మడిసినప్పటి కన్న
మించుగాఁగ నేడ్చెఁ జెంచుతల్లి! ౩౭౭

(౭—౫౩)

తే. ఏమియెఱుఁగనివారము మేము; ప్రియుఁడు
పలు తెఱంగుల తళ్కు బెళ్కులను వలచు;
వేఱుగతియును లే; దింక వెడలుచుండు
కంటినీ రెట్లు నిల్పుకోఁగలము? చెలియ! ౩౭౮

(౭—౫౪)

తే. చిలుక, ముక్కునఁ బొడుచుచోఁ జిల్లి మేన
నిండి యుండెడు మామిడిపండురసము
తోడఁబోవఁగఁ, దేంట్లును గూడిపాఱెఁ
దావిచేఁ గన్నుగానక దానివెంట. ౩౭౯

(౭—౫౫)

ఆ. ఇచట నేఁబరుండు; నిచ్చట నత్తగా;
రిచటఁ బరిజనంబు లెఱిఁగికొనుము;
రాత్రి నీకుఁగానరాదు; నాశయ్యపై
తప్పి పడెదవేమొ! దారికాఁడ! ౩౮౦

(౭—౫౭)

ఆ. ఎట్లు మేను పెంచె నిదియొక్కటే, తల
యెత్తిచూడు! మఱ్ఱివిత్తుమొలక!
ఇంత పెద్ద యడవి నితర వృక్షంబుల
న్నియును దీనిక్రింద నిలువవలసె! ౩౮౧
(౨—౨౦)

ఆ. ఎవరు సుగుణవంతు, లెవ్వరుదారు, లె
వ్వారు నేర్పుగల్గు వరవిదగ్ధు,
లట్టివారినెల్ల నరసి సేవించెదు;
పేదఱికమ! నీదు పెరిమయెంత! ౩౮౨
(౨—౨౧)

ఆ. ఎందు గుంటమిట్ట లేకమై, రాకలు
పోకలన్ని నిలిచిపోయి, చాల
నింతలోనె దారులెల్లను గోర్కుల
కైన దాఁటరాని వగును జూవె * ౩౮౩
(౨—౨౩)

క. ఊరక యల్గుట, క్షణమున
నూరడిలుట, టక్కులాడుచుందువని కడుఁ
దూఱుట, నీమఱుఁగునఁ బలు
మాటేడ్పుట-యెల్ల స్నేహమార్గము కొడుకా!
(౨—౨౪)

---

* రాఁబోవు వర్షాకాల వర్ణనమిది.

ఆ. రెండు చెవులఁ గ్రోలుచుండుఁ జిన్నది నీదు
పలుకులెల్ల జనుల కలకలమునఁ
గలిసియున్నఁగాని, కడఁకమై రాయంచ
పాలు నీటినుండి క్రోలునట్లు. ౩౮౫

(౨-౨౬)

ఆ. ముగుద! ప్రియుని చరితముల నిట్టులడిగెదు
కుర్చ్చికుర్చ్చి; సిగ్గుగూడ లేక!
మరువమునకుఁ దావి మైయెల్ల నెలకొని
యుండఁ బువ్వులు లేక యున్ననేమి? ౩౮౬

(౨-౨౭)

ఆ. కావివన్నెయెల్లఁ గడచె నించుకఁ యైన
లేక; ముగుద! నమ్మలేవుగాని;
లేఁత చివురుటాకు లీలఁ గెంపైన నీ
కరయుగంబు నేల కడిగెదిట్లు? ౩౮౭

(౨-౨౮)

ఆ. అదిగో చూడు సుందరాంగి! నీరంతయు
ముగియఁ గురిసియుండు మొగిలుగములు
తోఁచె, నేకినట్టి దూదికుప్పలు వోలె,
కూడుకొన్న యుప్పుకొండలట్లు. ౩౮౮

(౨-౨౯)

ఆ. నడుమఁ గొంతయొండి నడకచేఁ, బంకంబు
రెండు ప్రక్కలందు నిండియుండఁ
బొలిచె రచ్చ, యూరితలమీఁదఁ బాపట
తీసియున్నయట్టి తెలుఁగు దోఁప. ౩౮౯

(౭-౮౨)

తే. ఇంటి కపరాహ్ణవేళలో నేఁగుదెంచి
నట్టి యల్లునికోర్కె రెండంతలయ్యె,
పెరటి జలదారిలోపలఁ బెండ్లికూఁతు
జలకమును దెల్పు గాజుల గలగలలకు. ౩౯౦

(౭-౮౩)

ఆ. ఇచ్చకములఁ జేతురెన్నెని; తమ పని
దీఱినంత మరలఁ దిరిగి కనరు;
వినుఁడు; కూళజనులు వీరు, కుక్కలవంటి
వారు; వీరి నమ్మవలదు మీరు. ౩౯౧

(౭-౮౪)

ఆ. పైరు కోర్కెమీఱి పండ శారదవేళఁ
బాడు నిచ్చకోలఁదిఁ బల్లెరైతు,
చక్కదంచినట్టి సన్నబియ్యముఁ బోలు
వన్నెగల్గు నిండు వెన్నెలలను. ౩౯౨

(౭-౮౯)

ఆ. మనుజలోకమందుఁ గనులును జెవులును
లేనివారి బ్రదుకు లెస్సచూవె!
తులువలైనవారి కలిమి పెంపొందుట
కనరు; వినరు కొండెగాండ్రి పలుకు. ౩౯౩

(౭—౯౫)

తే. ఎచట నుండిరో మూగలై యెల్లవారు
నాఁడు? వలదని తిట్టుచున్నారు నేఁడు-
విసము పోలిక నోర్వఁగ వసముగాక
యెల్లయొడలికి వలపుకై పెక్కుయుండ! ౩౯౪

(సిరి సుందరుఁడు. ౭—౯౬)



తే. సంధ్యవార్పఁగ దోసిట జలమువట్టి
నపుడు గౌరీముఖాంబుజమందుఁ దోఁప,
మంత్రమంతయు నొకమాఱు మఱచి వట్టి
మోవిని గదల్చు శివునకు మ్రొక్కులిడుఁడు!

(హాలుఁడు(?) ౭—౧౦౦)

౩౯౫

